# నాది లోచన
# నీది ఆలోచన





రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**

అను రచయిత : **నారాయణ రావు** (విశాఖ పట్టనము)



www.thraithashakam.org



# నాది లోచన
# నీది ఆలోచన


రచయిత

**త్రిమత ఏకైక గురువు**

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, (83) దశ అష్టాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

## శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

**అనురచయిత : నారాయణ రావు (విశాఖపట్టనము)**






ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము–38 ప్రథమ ముద్రణ : నవంబర్–2016

ప్రతులు : 1000 **వెల : 40 /-**

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక రచనలు

## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
03) ధర్మము-అధర్మము.
04) ఇందుత్వమును కాపాడుదాం.
05) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
06) దయ్యాల-భూతాల యదార్థసంఘటనలు.
07) సత్యాన్వేషి కథ.
08) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
09) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
10) గీతా పరిచయము
11) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
12) జనన మరణ సిద్ధాంతము.
13) మరణ రహస్యము.
14) పునర్జన్మ రహస్యము.
15) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
16) కథల జ్ఞానము.
17) సామెతల జ్ఞానము.
18) పొడుపు కథల జ్ఞానము.
19) తత్త్వముల జ్ఞానము.
20) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
21) గీతం-గీత (పాటల జ్ఞానము).
22) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
23) దేవాలయ రహస్యములు
24) ఇందూ సాంప్రదాయములు.
25) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
26) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
27) తల్లి తండ్రి.
28) గురు ప్రార్థనామంజరి.
29) త్రైతారాధన.
30) సమాధి.
31) ప్రబోధ
32) సుబోధ.
33) ప్రసిద్ధి బోధ.
34) సుప్రసిద్ధి బోధ.
35) సిలువ దేవుడా?
36) దేవుని గుర్తు-963.
37) మతము-పథము.
38) ఇందువు క్రైస్తవుడా?
39) ఆత్మలింగార్థము.
40) నాస్తికులు-ఆస్తికులు.
41) గుత్తా.
42) ప్రబోధ తరంగాలు.
43) త్రైత సిద్ధాంతము.
44) రూపము మారిన గీత.
45) ద్రావిడ బ్రాహ్మణ.
46) తీర్పు.
47) కర్మ పత్రము.
48) ప్రవక్తలు ఎవరు?
49) ధర్మశాస్త్రము ఏది?
50) వార్తకుడు-వర్తకుడు.
51) దేవుని చిహ్నము.
52) ఏది నిజమైన జ్ఞానము?
53) నిగూఢ తత్త్వార్థ బోధిని.
54) ప్రబోధానందం నాటికలు.
55) మత మార్పిడి దైవద్రోహము.
56) మతాతీత దేవుని మార్గము.
57) హేతువాదము-ప్రతివాదము.
58) నీకు నా లేఖ.
59) జీహాద్ అంటే యుద్ధమా?
60) త్రైతశక పంచాంగము.
61) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
62) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.

## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

63) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
64) మరణము తర్వాత జీవితము.
65) ఏ మతములో ఎంత మతద్వేషము?
66) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
67) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
68) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
69) స్వర్గము ఇంద్రలోకమా!-నరకము యమరాజ్యమా!!
70) ఒక మాట మూడు గ్రంథములు.
71) లు అంటే ఏమిటి? (తెలుగు)
72) ఆదిత్య.
73) చెట్టుముందా! విత్తుముందా?
74) ఒక్కడే ఇద్దరు.
75) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
76) దేవుని రాకకు ఇది సమయము కాదా!
77) సాయిబాబా దేవుడా! కాదా?
78) విశ్వ విద్యాలయము
79) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
80) గీటురాయి
81) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు
82) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు
83) భావము-భాష
84) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ
85) నాది లోచన-నీది ఆలోచన
86) హిందూమతములోనే కులవివక్ష
87) దేవుని ముద్ర
88) యోహాను సువార్త
89) ధర్మచక్రము
**90) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.**
**91) మధ్యమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**92) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**93) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు (రెండవ భాగము)**

# ఇతర సంఘముల ప్రచురణలు

## ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ

1. అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు. 2. ఖుర్ఆన్‌లో ఆణిముత్యాలు.
3. అంతిమ దైవగ్రంథములో అర్థాలు-అపార్థాలు. 4. జకాత్ (ఆర్థిక సేవ).
5. అంతిమ దైవగ్రంథములో జ్ఞాన రత్నాలు. 6. షరియతా-జ్ఞానమా.
7. అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు. 8. ఖుదా-అల్లాహ్. 9. రెక్కల గుఱ్ఱము.
10. చంద్రుడు-నక్షత్రము.

## సువార్త క్రైస్తవ సంఘం

1. మతాలన్నిటికి ప్రాథమిక జ్ఞానము.
2. మత ధిక్కారము కాదు-సత్యగ్రాహితము.
3. పాప క్షమాపణ ఎలా కలదు?
4. ముందు చూపు.

## రావణ బ్రహ్మ ద్రావిడ బ్రాహ్మణ సంఘం

1. త్రైత సిద్ధాంత పరిశీలన
2. త్రైత సిద్ధాంతం సూపర్ సైన్స్
3. కాలజ్ఞానములో ఆనంద గురువు.
4. అంతర్ ధన శతకము (జ్ఞాన ధన శతకము)
5. బెర్ముడా ట్రయాంగిల్-సైంటిస్ట్‌లకు సవాల్
6. ట్విన్ టవర్స్ (9/11) ట్రూత్
7. తెలుగు-వెలుగు

## ద్రావిడ శ్రేష్ఠి సంఘం

1. సంఖ్య లో అంఖ్య

*DVD'S*

01. సంతకము.
02. సాంప్రదాయము.
03. త్రైతశకము.
04. కోడిపుంజు-పాదరసము.
05. యుగము-యోగము.
06. నైజం-సహజం.
07. ఆత్మకు వెంట్రుక గుర్తు.
08. పైత్యం-సైత్యం.
09. శైవము-వైష్ణవము.
10. ఇందూ మహాసముద్రము.
11. సృష్ఠి-సృష్ఠికర్త.
12. కాయ-పండు-కాయ.
13. జ్ఞానము-విజ్ఞానము.
14. వార-మాస-వత్సర.
15. సేకూవలి-కూలిసేవా.
16. ధర్మము-అధర్మము.
17. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
18. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
19. బట్టతల.
20. భగవంతుడు.
21. ద్రావిడులు-ఆర్యులు.
22. ప్రభువు-ప్రభుత్వం.
23. భూతం-మహాభూతం.
24. ప్రభు-ప్రజ.
25. యాదవ్.
26. పుస్తకము-గ్రంథము.
27. వెలుగుబంటు.
28. ప్రకృతి-వికృతి.
29. మాట-మందు.
30. ఏకత-ఏకాగ్రత.
31. హరికాలు-హరచేయి.
32. పుట్టగోసి-మొలత్రాడు.
33. 1 2 3 గురుపౌర్ణమి.
34. చమత్కార ఆత్మ.
35. క్షమించరాని పాపము.
36. మాయకుడు-అమాయకుడు.
37. మరణము-శరీరము.
38. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
39. ద్వితీయుడు-అద్వితీయుడు.
40. బయటి సమాజం-లోపలి సమాజం.
41. సేవా శాతము.
42. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
43. శ్రీకృష్ణాష్టమి.
44. దేవుని జ్ఞానము-మాయ మహత్యము
45. తల్లి తండ్రి.
46. తల్లి తండ్రి-గురువు దైవము.
47. సమాధి.
48. మతము-పథము.
49. కలియుగము.
50. దివ్యఖురాన్-హదీసు.
51. పుట్టుట-గిట్టుట.
52. తల్లి.
53. గోరు-గురు.
54. కర్మ మర్మము.
55. ఆత్మ.
56. తాత.
57. గురుపౌర్ణమి.
58. ఇందువు-హిందువు.
59. శ్రీకృష్ణజన్మ మధుర.
60. ఆత్మపని.
61. త్రైత సిద్ధాంతము.

*DVD'S*

62. కర్మ లేని కృష్ణుడు–
కర్మ ఉన్న కృష్ణుడు.
63. సహజ మరణం–
తాత్కాలిక మరణం.
64. స్త్రీ–పు / లింగము.
65. దేశం మోసం–దేహం మోహం.
66. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
67. జీర్ణ+ఆశయము.
68. మేఘం ఒకభూతం–
రోగం ఒకభూతం.
69. దేవునికి మతమున్నదా?
70. ఇచ్ఛాధీన కార్యములు–
అనిచ్ఛాధీన కార్యములు.
71. ఏది ధర్మము?
72. అధర్మ ఆరాధనలు.
73. మూడు పుట్టుకలు–రెండు జాగాలు.
74. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
75. నిదర్శ – నిరూప.
76. నటించే ఆత్మ.
77. సంచిత కర్మ.
78. గురువు ఎవరు?
79. శ్రీకృష్ణుడు ఎవరు?
80. సుఖము–ఆనందము.
81. టక్కుటమారా, ఇంద్రజాల
మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.
82. భయం.
83. దశ–దిశలు.
84. ఆడించే ఆత్మ.
85. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం)
86. మూడు నిర్మాణాలు–ఒక పరిశుభ్రత.
87. ఏది శాస్త్రము?
88. తెలుగులో మూడు–ఆరు–తొమ్మిది.
89. 6–3=6.
90. గుర్తింపబడనివాడు గురువు.
91. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
92. చంద్రాకారము (బట్టతల).
93. మతములలో పవిత్రయుద్ధము.
94. మూడు గ్రంథములు.
95. ఏడు ఆకాశములు.
96. దైవగ్రంథము
97. జ్ఞానము కబ్జా అయ్యింది!
98. భక్తి–భయము.
99. జ్ఞానశక్తి.
100. కాలజ్ఞాన వాక్యములు.
101. అర్థము–అపార్థము.
102. తోలేవాడు.
103. గురు చిహ్నం.
104. భక్తి–శ్రద్ధలు.
105. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
106. పురుషోత్తమ.
107. మతద్వేషము.
108. నీ వెనుక వాడు.
109. గ్రంథము – బోధ.
110. ఆట – దోబూచులాట.
111. ప్రజలు – మానవులు.
112. ఆస్తి – దోస్తి.
113. దంతము–అంతము.
114. మాయ మర్మము– ఆత్మ ధర్మము
115. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
116. అంతిమ గ్రంథములో
ప్రథమ వాక్యములు.
117. అదురు–బెదురు.
118. శవము–శివము
119. ధర్మచక్రము
120. ఆధ్యాత్మిక ప్రశ్నలు – జవాబులు.

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ** (సూర్య మీ సేవా)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

**P.M.H నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9440490963

**P. రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్థన్** (R.M.P)
ఆటోనగర్, బస్టాండు రోడ్
కోయిలకుంట్ల (మం), కర్నూలు (జిల్లా)
Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు (ప్రెసిడెంట్)**
MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**అనమల మహేశ్వర్ (ప్రెసిడెంట్)**
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు (ప్రెసిడెంట్)**
ఏటుకూరు రోడ్, దర్గామాన్యం,
గుంటూరు జిల్లా.
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి (ప్ర.సభ్యుడు)**
నరసరావుపేట, గుంటూరు జిల్లా
Cell : 9989204097, 9849555738

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం జిల్లా.
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా)
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్ (ప్రెసిడెంట్)**
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్ (ప్ర.సభ్యుడు)**
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు (టీచర్) (ప్రెసిడెంట్)**
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252,
9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ (ప్ర.సభ్యుడు)**
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ) (ప్రెసిడెంట్)**
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:7680065963, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హోస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 714 9696, +1(210) 527 3436

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# యోగీశ్వరుల వారి రచనల సారాంశము

1) త్రైత సిద్ధాంత గ్రంథములలో అక్షర సముదాయమే, ఆత్మ సమాచారమై ఉన్నది. త్రైత సిద్ధాంత గ్రంథములలో క్షయ అక్షయ సమాచారము, పరమాత్మ సమాచారము ఉన్నది.

2) త్రైత సిద్ధాంత సంబంధ గ్రంథములను భౌతికముగా వ్రాసినది యోగీశ్వర్లు. త్రైత సిద్ధాంత అనుబంధ గ్రంథములలో అభౌతికముగా యోగశక్తి ఉన్నది.

3) త్రైత సిద్ధాంతము ఇందూ (హిందూ) ధర్మములలో విప్లవాత్మకమైనది. త్రైత సిద్ధాంత గ్రంథములలోని జ్ఞానము సంచలనాత్మకమైనది, చదివి చూడండి.

4) త్రైత సిద్ధాంతము లోకములో అన్నిటికంటే గొప్పది. త్రైత సిద్ధాంత గ్రంథములు అన్ని గ్రంథములను మించినవి, దాని రచయిత యోగులకు ఈశ్వరుడైన యోగీశ్వరుడు.

5) త్రైత సిద్ధాంత గ్రంథములు కనిపిస్తే దుష్టశక్తులు భయముతో వణికిపోతాయి. త్రైత సిద్ధాంత గ్రంథములను దగ్గర ఉంచితే యోగశక్తికి తాళలేక భయపడిపోతాయి.

6) త్రైత సిద్ధాంత జ్ఞానము భగవద్గీత తరువాత చెప్పబడిన అతి గొప్ప జ్ఞానము. త్రైత సిద్ధాంత గ్రంథములలో కృష్ణుడు ముందు చెప్పని జ్ఞానమును కూడా యోగీశ్వర్లు చెప్పారు.

7) త్రైత సిద్ధాంత జ్ఞానము మానవ జీవితమునకు గొప్ప వెలుగు. త్రైత సిద్ధాంత వెలుగులోనికి పోయిన వానికి అది దైవశక్తి అని తెలియును.

8) త్రైత సిద్ధాంత భగవద్గీతను వ్రాసినది యోగీశ్వర్లు. అందువలన త్రైత సిద్ధాంతము అంటే ఏమిటో, అది ఎంత గొప్పదో తెలియబడినది.

9) త్రైత సిద్ధాంతమును గురించి తెలియగలిగితే, యోగీశ్వరుల గ్రంథములను చదువగలిగితే, ఏ మతస్థుడైనా ఒప్పుకొని తీరును, దానిని ఆచరించును.

10) త్రైత సిద్ధాంతము ప్రత్యక్షముగా భగవంతుడు చెప్పినది. అందువలన అన్ని మతముల సారాంశము త్రైత సిద్ధాంత గ్రంథములలో కలదు.

11) త్రైత సిద్ధాంత గ్రంథములు వ్యక్తి వ్రాసినవి కావు, వ్యక్తిలోని శక్తి వ్రాసినవి. అందువలన అన్నీ రహస్యములే చదివి తెలుసుకోండి.

12) త్రైత సిద్ధాంతము భగవద్గీత, బైబిలు, ఖురాన్ గ్రంథములలో కలదు. అయినా హిందువులకుగానీ, క్రైస్తవులకుగానీ, ముస్లీమ్‌లకుగానీ ఆ విషయము తెలియదు.

# నాది లోచన - నీది ఆలోచన

ఎవరి భావము ఎలా ఉన్నా నా భావము మాత్రము ఒకే విధముగా ఉన్నది. నేను నల్లగా ఉన్నానని కొందరు అనుచున్నారు, అలాగే నేను తెల్లగా యున్నానని కొందరు అనుచున్నారు. అయినా ఇతరుల భావమును ఏకీభవించి నేను వారు అనుకొన్నట్లు లేను అని చెప్పుచున్నాను. కొందరు నన్ను దయ్యము అన్నారు, కొందరు దేవుడు అన్నారు. అయినా నేను మాత్రము వారు అనుకొన్నట్లు దేవుడు కాదు, దయ్యము కాదు. సాధారణ మనిషిని మాత్రమేయని చెప్పుచున్నాను. ఇంకా కొందరు నన్ను దుర్మార్గుడు అన్నారు, కొందరు సన్మార్గుడు అని అన్నారు. అయితే నేను దుర్మార్గున్ని కాదు, సన్మార్గున్ని కాదని చెప్పుచున్నాను. నాలో ఇతరులకు నచ్చేవి ఏవి యున్నాయో తెలియదు కానీ, నాకు నచ్చేవి మాత్రము ఏవీ లేవు. నేను కొన్ని పనులు చేసిన తర్వాత నన్ను నేను ఛీదరించుకోవడము జరిగేది.

కుమారుడు ఎంత చెడ్డవాడైనాగానీ తల్లి తన కుమారున్ని మంచి వాడనే ఇతరులతో చెప్పుతుంది. తన కుమారుడు తనకు చెడు చేసినా తల్లి మాత్రము తన కుమారున్ని చెడ్డవాడని చెప్పక తన కుమారుడు గొప్ప వాడని, మంచివాడని చెప్పడము జరుగుచున్నది. అయితే నా విషయములో అలా జరుగలేదు. నా తల్లి నన్ను చెడ్డవానిగా, దుర్మార్గునిగా ఇతరులతో చెప్పింది, నన్ను నీచమైనవానిగా ప్రచారము చేసింది. బంధువులు కూడా నన్ను తక్కువగా చూస్తూ అగౌరవముగా మాట్లాడేవారు. పెద్దయిన తర్వాత ఎవరూ పిల్లను కూడా ఇవ్వరు, వీనికి పెళ్ళి కూడా కాదు అనెడివారు. అంతేకాక వేశ్యలుగా కాలము గడిపేవారే వీనికి తోడవుతారు అని అగౌరవముగా, నీచముగా మాట్లాడేవారు. నేను అందరి పిల్లలలాగే పెరుగుచూ వస్తున్నా, అంతేకాక అందరికంటే పద్ధతిగా ఉంటున్నాను, అయినా అందరూ అగౌరవముగా మాట్లాడేవారు. తల్లితండ్రులు సరిగా

పోషించలేదు. 14 లేక 15 సంవత్సరముల వయస్సులోనే ఒక ప్రక్క చదువుకొనుచూ సెలవు దినములలో కూలిపనికి పోయేవాడిని. చిన్నవయస్సులోనే పొలాలలో పనికి పోయి కూలి డబ్బులు తెచ్చి అమ్మకు ఇచ్చేవాడిని. చాలా కష్టముగా హైస్కూలు చదువును చదివాను. తర్వాత చదివే స్థోమత లేక అంతటితో ఆగిపోయాను. నిత్యము కూలి పనులు చేయడముకంటే ఏదో ఒక ఉద్యోగము చేయడము మంచిదని అనుకొన్నాను.

ఆ సమయములో అదృష్టముకొద్దీ మిలిటరీలో ఉద్యోగము దొరికింది. ఆర్మీలో 'వయర్‌లెస్ ఆపరేటర్'గా ట్రయినింగయి చేసి దాదాపు మూడు సంవత్సరములు హిమాచల్ ప్రదేశ్‌లో ఉద్యోగము చేశాను. ఆ సమయములో తల్లిని, తమ్ముని పోషించే నిమిత్తము పని చేస్తున్నా, దైవికముగా జ్ఞానమును తెలియాలనుకొన్నాను. అంతటితో ఉద్యోగమును మానుకొన్నాను. అయినా బయట ఏదో ఒక పని చేసి తల్లిని పోషించే వాడిని. కొంత కాలమునకు నేను ఆధ్యాత్మిక విద్యలో ఎంతో ఎదగగలిగాను నాకు తెలిసిన దానిని ఇతరులకు చెప్పేవాడిని. సమాజములో కొంత గౌరవము పెరిగినది. చాలామంది నన్ను గౌరవించేవారు. అయితే నా తల్లికి అది ఏమాత్రము నచ్చలేదు. నన్ను చూస్తే పూర్తి అసూయ ఆమెలో ఏర్పడినది. సమయము దొరికితే చాలు నన్ను గురించి చెడుగా చెప్పేది. నా కడుపు చెడ్డది, నాకు నీచమైన కొడుకు పుట్టాడని ప్రచారము చేసేది. ఆమె ఎందుకు అలా చేయుచున్నదో నాకు మాత్రము ఏమీ అర్థమయ్యేది కాదు. ఆమెకు అన్ని సౌకర్యములను కలుగజేసినా నన్ను చెడ్డగా ప్రచారము చేసేది. చాలామంది నావద్దకు జ్ఞానము తెలియుటకు వచ్చినా, కొంత జ్ఞానము తెలిసినా, స్వయానా తల్లి నన్ను చెడ్డగా చెప్పడము వలన వారు తర్వాత వచ్చేవారు కాదు. నావద్దకు వచ్చేవారికి ఏ విధముగానయినా ఏదో ఒకటి బోధించి వారిని నావద్దకు రాకుండా చేసేది.

నన్ను స్వంత తల్లి దుర్మార్గుడుగా చెప్పడము వలన చాలామంది నమ్మేవారు. ఆమెవలన నాకు చాలా కష్టాలు రావడము కూడా జరిగినది. ఆమె మాటలు విని నన్ను నిందించిన వారు కూడా కలరు. చివరకు ఆమె చనిపోయింది. తర్వాత నా బోధలు ప్రజలకు చేరను మొదలు పెట్టాయి. నేను ఒక్కనిగా ధనము లేకుండా, జన బలము లేకుండా జ్ఞానమును చెప్పడము ప్రారంభించి అనేక అవరోధములను దాటుచూ ముందుకు వచ్చి నేడు ఒక 'ఆధ్యాత్మిక సామ్రాజ్యము'ను స్థాపించగలిగాను. ఒకప్పుడు ప్రజలకు ఎంత తక్కువగా కనిపించానో దానికి వ్యతిరేఖముగా నేడు గొప్పగా కనిపించుచున్నాను. ఇదంతా దేవుడు చేసినదని నాకు బాగా తెలుసు. ఆయన ఇష్టప్రకారము ఏమయినా చేయగలడు. ఇప్పటికి నా వయస్సు 66 సంవత్సరములు. 50 సంవత్సరములు నా జీవితమును కష్టాలలోనే గడుపుతూ వచ్చాను. 50 సంవత్సరముల తర్వాత ఆర్థికముగా కొంత బాగుపడినా, ఇప్పుడు శారీరకముగా కొన్ని ఆరోగ్య ఇబ్బందులు తప్పలేదు. నేను చెప్పిన జ్ఞానమును చూసి నేడు కొందరు నన్ను ఎంత గొప్పగా చెప్పినా నేను గడిపిన జీవితము నాకు జ్ఞాపకముండుట వలన నాలో గొప్పతనము ఏమీ లేదని నాకు బాగా తెలుసు. నేను నా బ్రతుకంతా కష్టాలలో గడిపినా నేడు కూడా ఆరోగ్య విధానములో కొంత బాధపడుచూనే ఉన్నాను. అంతేకాక మానసిక సమస్యలు కూడా ఉండనే ఉన్నాయి. ఇవన్నీ నాకు బాగా కనిపిస్తూవుంటే ఇతరులు నన్ను గొప్పగా పొగడినంత మాత్రమున నేను గొప్పవాడినవుతానా? నన్ను దేవుడు అంటే నేను నమ్ముతానా? ఇతరుల భావము ఎలా ఉన్నా, నా భావములో నేను ఒక మనిషిని. మనుషులలో కూడా ఒక దురదృష్టవంతున్ని. నేడు కూడా ఏదో ఒక కష్టమును అనుభవిస్తూ అసంతృప్తి జీవితమును గడుపుచున్నవాడిని. కర్మ చేతిలో చిక్కి బాధలనే అనుభవిస్తున్న వాడిని. ఇదంతయూ చూస్తే మా జీవితము వడ్డించిన

విస్తరిలాగా అందరికీ అర్థమయ్యేలాగ యున్నది. ఇదంతయూ బహిరంగ హృదయముతో ఏమీ దాచుకోకుండా చెప్పినది. ఇదంతయూ ఒక విధానము కాగా, నా జీవితములో దాచుకోకుండా చెప్పితే మరొక కోణము కూడా కలదు. దానిని కూడా దాచకుండా చెప్పెదను చూడండి.

భూమిమీద జన్మకల్గినప్పుడు అందరిలాగా నాకు జ్ఞప్తి లేదు. అయినా అందరిచేత ఒక ప్రత్యేకమైన పదముతో పిలువబడేవాడిని. నాకు పెట్టబడిన పేరు పెద్దన్న. దానివలన కొందరు 'పెద్దన్న' అను పేరుతో పిలిచెడివారు. మరి కొందరు 'పెద్దోడా' అని పిలిచేవారు నాకు ఏడు లేక ఎనిమిది సంవత్సరముల వయస్సులో నన్ను పెద్దోడా అనిగానీ, పెద్దన్నా అనిగానీ పిలువడము ఆశ్చర్యముగా ఉండేది. అందరూ నాకంటే పెద్ద వాళ్ళుగా ఉండి నన్ను పెద్దోడా, పెద్దన్నా అని పిలువడమేమిటి? అని అనుకొనెడి వాడిని. స్థూల ప్రపంచములో ఏ విలువ లేనివాడినయినా నన్ను అందరూ **'పెద్ద'** అను పేరుతో పిలిచెడివారు. అయినా దానివలన కనిపించే లాభము ఏమీ లేదు. నాలో కనిపించని ప్రత్యేకతలు కొన్నియున్నా ప్రపంచములో అవి ఏమాత్రము గుర్తింపబడేవి కావు. బాల్యము గడచిపోయి యుక్తవయస్సు వచ్చినది. అప్పటికే ఉద్యోగ విరమణ చేశాను. నేను ఆర్థికముగా పేదవాడినే అయినా నావద్దకు వచ్చిన వారికి రోగములు లేకుండా పోవడము జరిగేది. తర్వాత సూక్ష్మ గ్రహ బాధలు నయమైపోయేవి. ఒక్కొక్కమారు సూక్ష్మములు ఇతర శరీరములనుండి మాట్లాడేవారు. దేవతలు కూడా చాలామంది మాట్లాడడము జరిగినది. అప్పటికి దేవతల విషయము, దయ్యాల విషయము పూర్తిగా అర్థమయినది.

దేవుడు వేరు, దేవతలు వేరని తెలిసిన తర్వాత దేవతలను మనుషులను సృష్టించిన దేవున్ని గురించి తెలియాలనుకొన్నాను. నేను

పోవు జ్ఞానమార్గములో మనుషులు ఆటంకముగా ఉండేవారు. ఇంటిలో తల్లితో సహా వ్యతిరేఖతకల్గి ముందుకు సాగనిచ్చేవారు కాదు. ఎన్ని వ్యతిరేఖతలు వచ్చినా నా మార్గమును కొనసాగించేవాడిని. ఆ ప్రయత్నములో వరుసగా ఆరురోజులు నిద్రమానివేసి ఆలోచించాను. కొన్ని సందర్భములలో దేవతలు కూడా ఆటంకముగా ఉండేవారు. చాలామార్లు నేను దేవతలను దండించి పంపడము కూడా జరిగినది. కొందరు దేవతలు నన్ను చంపుతామని చెప్పినవారు కూడా కలరు. దేవుడు నన్ను నడిపిస్తూ, నా మార్గములోని ఆటంకములన్నీ తీసివేయడము వలన అసలయిన ఆధ్యాత్మికమును తెలియగలిగాను. నిజమైన ఆధ్యాత్మికమును తెలిసిన తర్వాత నిద్రలోనివారు కొద్దికొద్దిగా మెలుకువలోనికి వచ్చినట్లు, నేను ఎవరినో కొద్దికొద్దిగా నాకు తెలియుచూ వచ్చినది.

నేడు నన్ను గురించి నేను సంపూర్ణముగా తెలియగలిగాను. అందువలన నన్ను నేడు ఎవరు ఎంత గొప్పగా చెప్పినా, నేను మీరు అనుకొన్నంత గొప్పవాడిని కాదు అని చెప్పుచున్నాను. నేను సామాన్య మనిషినే అని చాలామార్లు చెప్పుచూ వచ్చాను. సత్యము చెప్పితే దేవుడు, దేవుని జ్ఞానమును గురించి సత్యము ఏదయితే ఉందో అదంతా నావద్దనుండే వస్తున్నది. అయితే దానిని చెప్పువాడను మనిషిగా నేను కాదు. **"దేవుడు తన జ్ఞానమును మూడు విధముల తెలియజేతును"** అని అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లో చెప్పడమైనది. అయితే ప్రథమ దైవగ్రంథము భగవద్గీత (తౌరాతు) గ్రంథములో **"నేను మీ హృదయస్థానములో ఉంటూ జ్ఞానమును తెలియజేతును"** అని చెప్పాడు. ఆ విధానమును ఉపయోగించు కొని ఆయన నా శరీరమునుండి అసలయిన, సత్యమైన తన జ్ఞానమును బోధించుచున్నాడు. పైకి బోధ చెప్పువాడిగా నేను కనిపించినా, నా

శరీరముతో నేనే చెప్పుచున్నట్లు తెలియుచుండినా, వాస్తవముగా చెప్పువాడను నేను కాను, ఇది సత్యము.

బోధించువాడిగా పైకి నేనే అందరికీ కనిపించడము వలన చాలామంది నన్ను గొప్పవానిగా భావించడము జరుగుచున్నది. మీరు నన్ను గురించి ఆలోచించుచున్నారు. మీ ఆలోచనకు నేను గొప్పగా కనిపించడము వలన నన్ను గొప్పగా ఊహించి దేవునంతటి వానిగా కొందరు పొగడుచున్నారు. మీరు నన్ను ఆలోచించి చెప్పుచున్నారు. మీరు నన్ను దూరముగా చూచి చెప్పుచున్నారు. అందువలన మీకు నేను ఎలాగయినా కనిపించి యుండవచ్చును. అయితే నేను నన్ను దగ్గరగా చూచుచున్నాను. మీరు నన్ను ఆలోచనతో చూస్తే, నేను నన్ను లోచనతో చూస్తున్నాను. 'ఆలోచన' అనగా దూరమునుండి చూడడము, 'లోచన' అనగా దగ్గరనుండి చూడడము. యోచన అనగా 'తనను తాను చూచుకోవడము". నేను ఆలోచన చేయడము లేదు. లోచన మాత్రము చేయుచున్నాను. లోచన యోచనగా మారుచున్నది. యోచన ద్వారా నేను, నా ఆత్మ రెండు ఒకటిగా యున్నా నా లోచన ద్వారా అనగా లోపలి చూపు (దగ్గరి చూపు) ద్వారా నేను వేరు, నా ఆత్మ వేరుగా యున్నట్లు తెలియుచున్నది. నేను మనిషిగా పుట్టాను. నాకు అందరిలాగే గుణములు కూడా యున్నవి. వాటి ప్రకారమే ప్రవర్తన కూడా ఉండును. నేను మనిషిని అనుటకు నా గుణములే నిరూపణగాయున్నవి. అయితే నన్ను నేను చూచుకోగలిగితే అనగా లోచన ద్వారా దగ్గరగా చూడగలిగితే నేను శరీరమును ధరించిన జీవాత్మనే అయితే నేను ఎక్కువగా ఆలోచనగానీ, లోచనగానీ చేయక యోచన చేయడము వలన నేను, నా ఆత్మ ఒకటిగా యుండడము జరుగుచున్నది. అప్పుడు నేను చెప్పినట్లు బయటికి కనిపించినా నా నుండి బోధను చెప్పువాడు ఆత్మనే. అందువలన నేడు మూడు గ్రంథములలో

దేవుడు చెప్పిన జ్ఞానము తెలియబడుచున్నది. సర్వ ప్రపంచమునకు అవసరమైన జ్ఞానము నానుండి తెలియబడుచున్నదని నాకు కూడా లోచన ద్వారా తెలియబడుచున్నది. అయితే మీకు ఆలోచన ద్వారా నేనే చెప్పినట్లు కనిపించుచున్నది. నాకు మాత్రము యోచన ద్వారా నేనే చెప్పినట్లు తెలియడమేకాక వాస్తవముగా నేనే చెప్పుచున్నాను.

ఇప్పుడు చెప్పిన కొన్ని నా మాటలు మీకు అర్థము కాకపోవచ్చును. మతి చలించినవాడు మాట్లాడినట్లుండవచ్చును. అయినా నేను చెప్పినది పూర్తి సత్యము. మీకు ఏదయితే ఆలోచన ద్వారా తెలియుచున్నదో అది నా యోచనలో సత్యమే. అందువలన మీరు నేను జ్ఞానమును చెప్పానని పొగడినా అది సత్యమే. అయితే నా లోచన ప్రకారము నేను చెప్పలేదని, నేను చెప్పలేదనునదే సత్యమని చెప్పుచున్నాను. ఇక్కడ అందరికీ తెలియని సత్యమొకటి గలదు. అదేమనగా! అందరి శరీరములలో తెలియకుండా దేవుడు ఒక్కడే లేడు. దేవునితో పాటు ఆత్మ అనువాడు కూడా ఉన్నాడు. ఆత్మతో పాటు జీవుడయిన మనము ఉన్నాము. దేవుడు, జీవుడు శరీరములో ఏ కార్యమును చేయడము లేదు. శరీరములో కార్యములు చేయువాడు ఆత్మ ఒక్కడే కలడు. నీ శరీరము ద్వారా జరుగు ప్రతి పని చేయడముగానీ, ప్రతి మాట మాట్లాడడముగానీ, బయటికి కనిపించునట్లు జరిగే ప్రతి కార్యమును ప్రతి మాటను ఆత్మే చేయుచున్నది. అయితే ఆ విషయము ఎవరికీ తెలియడము లేదు. అందరూ జరుగు పనులన్నీ తామే చేయునట్లు, మాట్లాడే మాటలన్నియు తామే మాట్లాడునట్లు అనుకోవడము జరుగుచున్నది. అలా అనుకోవడమే మనిషికున్న అజ్ఞానము.

మనిషికి తెలియని వాస్తవమును చెప్పితే మనిషి అయిన ప్రతి ఒక్కరికీ ఆశ్చర్యము తప్పక కల్గును. అది ఏమనగా! మీరు మీ తండ్రి

వలన పుట్టలేదు. ఈ మాట జ్ఞానము తెలిసిన మనుషులకు ఆశ్చర్యము కాదు. జ్ఞానులయిన వారు దేవుని వలన పుట్టామని దేవుడు అందరికీ తండ్రియని అనుకొంటుంటారు. అదియు సత్యము కాదు. అందరూ దేవుని వలన ఎవరూ పుట్టలేదు. అందువలన అంతిమ దైవగ్రంథములో 112వ సూరా 'అల్ ఇఖ్లాస్" లో మూడవ ఆయత్‌లో ఇలా కలదు. **(112-3) "ఆయనకు ఎవరూ సంతానము లేరు. ఆయన ఎవరికీ సంతానము కాదు"** ఈ వాక్యమును బట్టి **"దేవుడు ఎవరికీ పుట్టలేదు. ఆయనకు ఎవరూ సంతానము లేరు"** అన్నమాట వాస్తవమే. మనుషులకు వాస్తవముగా తండ్రి దేవుడు కాదు. దేవుడు మనుషులకు తండ్రి కాడను మాటను పై వాక్యములో చెప్పినా, అట్లే ఆయనకు మనుషులు కుమారులు కాదని చెప్పినా, దేవున్ని బాగా అర్థము చేసుకొంటే దేవుడు తన ఆత్మకే తాను తండ్రిగా ఉన్నాడు. దేవుడు ఆత్మకు తండ్రిగాయుండగా, ఆత్మ సర్వమానవులకు తండ్రిగా యున్నాడు. దీనినిబట్టి దేవుడు మనుషులకు తాత అవుతాడు తప్ప తండ్రి కాదు. **"అందరికీ తండ్రి ఆత్మ"**యని తెలియవలెను. దేవుడు, ఆత్మ, శరీరములో వేరుగా చెప్పబడినా వారు ఇద్దరూ ఏకముగా యున్నారని, జ్ఞానరీత్యా వేరుగా యున్నారనీ చెప్పకతప్పదు. సర్వులకు ఆత్మ తండ్రి, దేవుడు తాత.

ఈ పద్ధతి తెలియజేయుటకు, ఈ రహస్యమును తెలియజేయుటకు మూడు రకములుగా, మూడు బోధలుగా ఆత్మల జ్ఞానము చెప్పబడినది. అదే మూడు దైవగ్రంథములుగా వ్రాయబడినది. మూడు దైవగ్రంథములలో మూడు ఆత్మలను చెప్పడమే ముఖ్యమైన సారాంశముగా యున్నది. మూడు గ్రంథముల సారాంశమును ఒకమారు ఇక్కడ చెప్పదలచాను. నేను జీవుడను, నాకు తండ్రి ఆత్మ, ఆత్మకు తండ్రి పరమాత్మ. నాకు తండ్రి, తాత గలరు.

తండ్రియైన ఆత్మకు తండ్రి ఒక్కడు గలడు, తాత లేడు. తండ్రికి కుమారుడు గలడు. కుమారుడయిన నేను తండ్రిని చూడగలిగితే, తండ్రి ద్వారా తాతను తెలియవచ్చును. అంతవరకు తాతయైన దేవుడు ఏమాత్రము తెలియబడడు. అందువలన మీరందరూ మీ తండ్రియైన, అందరి తండ్రియైన ఆత్మను తెలియుటకు ప్రయత్నించండి. ముందు ఆత్మజ్ఞానము తెలియండి తర్వాత దేవున్ని గురించి తెలియవచ్చును. కుమారున్నయిన నేను నా తండ్రితో కలిసి ఉంటాను. మీకు మీ తండ్రి తెలుసా? మీరు మీ తండ్రితో కలిసి ఉంటారా? ముందు మీ తండ్రిని చూచుకోండి. తర్వాత నన్ను గురించి ఆలోచించవచ్చును.

ఇట్లు

**యోగీశ్వర్**

**అనురచయిత : నారాయణ రావు (విశాఖపట్టనము)**

**"త్రైత సిద్ధాంతము"** బ్రహ్మవిద్యాశాస్త్రానికే మూల సిద్ధాంతము. బ్రహ్మవిద్యా శాస్త్రాన్ని సమూలంగా బయలుపరచి, దైవత్వాన్ని అనుభవింప జేసి, దైవాన్ని ప్రత్యక్షపరచిన ఏకైక ఆధ్యాత్మిక సిద్ధాంతము **త్రైత సిద్ధాంతము.** నాలుగు శాస్త్రాలలోని విషయాలకే పరిమితము అయిపోయిన మనిషికి, దేవుని జ్ఞానము కూడా శాస్త్రబద్ధముగానే ఉన్నది అని నిరూపించినది త్రైత సిద్ధాంతము. ప్రతి మనిషి అనుభవాలతో ముడిపడి ఉన్న నాలుగు శాస్త్రాలను కొంచెము పరికించి చూడండి. ఒక శాస్త్రముతో వేరొక శాస్త్రం పరస్పర సంబంధము కలిగి ఉన్నాయి. ఒక శాస్త్ర సంబంధ విషయ సహాయము లేనిదే వేరొక శాస్త్రము అధ్యయనము చేయలేని పరిస్థితి ఉన్నట్లు అర్థము అవుతుంది. ఆయా శాస్త్రముల పరస్పర సంబంధము సహజ సిద్ధంగా ఉన్నవే తప్ప, ఏ మానవుడు ఆ శాస్త్రాలకు పరస్పర సంబంధాన్ని చేకూర్చి కనిపెట్టలేదని అర్థమవుతుంది. ఇదే విధానాన్ని అనుసరించి ఆధునిక విజ్ఞానాన్ని బ్రహ్మ విద్యా శాస్త్రానికి అనుసంధానించి, దేవుని జ్ఞానము కూడా శాస్త్రబద్ధముగానే ఉన్నది అని నిరూపించినది త్రైత సిద్ధాంతము. త్రైత సిద్ధాంతము అనగానే ఇది కూడా అద్వైత, విశిష్టాద్వైత మరియు ద్వైత సిద్ధాంతముల మాదిరి ఇందూమతములో ఆధ్యాత్మిక సంబంధం కలిగిన ఒక సిద్ధాంతము అయి ఉండవచ్చు అన్న సాధారణమైన భావము కలుగవచ్చు. భూమిమీద బ్రహ్మ విద్యా శాస్త్రాన్ని తెలియజేసే సిద్ధాంతము ఇది అనీ, ధర్మశాస్త్రాన్ని తెలియజేసే గ్రంథము ఇది అనీ, నిర్ధిష్టముగా ఇంతవరకు ఏ మానవుడూ తెలియలేకపోయాడు అన్న కఠోర సత్యము నేడు త్రైత సిద్ధాంతము ద్వారా తెలిసిపోనున్నది. త్రైత సిద్ధాంతము ఒక మతానికి, ఒక ప్రాంతానికి, ఒక వర్గ ప్రజలకు సంబంధించిన

సిద్ధాంతము కాదు. ఆధునిక విజ్ఞానమే ఆధ్యాత్మికానికి అడ్డంకిగా మారిన నాస్తికులు మరియు హేతువాదులు దైవాన్ని తెలియడానికి త్రైత సిద్ధాంతము ఒక ఋజుమార్గంలాంటిది.

ఆధునిక విజ్ఞానము పట్ల పరిజ్ఞానములేని ఆస్తికులకు మరియు ఆధ్యాత్మిక బోధకులకు త్రైత సిద్ధాంతము ఒక మార్గదర్శి. విశ్వములో ఎన్నో విషయాలను, విశేషాలను కనుగొని వాటిని శాస్త్రబద్ధము, శాస్త్ర సమ్మతము చేసిన శాస్త్రవేత్తలు సహితము దైవము విషయములో మానవ జాతిని మూఢములో, అజ్ఞానములోనే ఉంచారు అంటే, దేవుని విషయము మనిషి చెప్పలేడు అని కొంత రూఢి చేసుకోవచ్చు. **త్రైత సిద్ధాంత ఆదికర్త మరియు త్రిమత ఏకైక గురువు, శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరుల వారి త్రైత సిద్ధాంతము** బోధరూపమై, గ్రంథరూపమై బ్రహ్మవిద్యా శాస్త్రముగా మన అందరికీ సుపరిచయమైనదే. ఆ గ్రంథములలో ముఖ్యముగా **"ప్రథమ దైవగ్రంథము భగవద్గీత", "సువార్త బైబిలు", "అంతిమ దైవగ్రంథములో జ్ఞాన వాక్యములు"** గా మనముందరున్నవి.

మూడు దైవ గ్రంథాలను సుపరిచయము చేసి, అవి మత గ్రంథాలు కావు, ధర్మశాస్త్రాన్ని తెలియజేసే దైవ గ్రంథాలు అని వెలుగెత్తి చెప్పిన వివేకవంతుడు శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు. మూడు ప్రాంతాలలో, మూడు భాషలలో, మూడు విధానముల ద్వారా తెలియబడ్డ మూడు గ్రంథముల జ్ఞానము ఒకే దేవుని జ్ఞానము అని తెలియజెప్పిన విజ్ఞానవేత్త శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు. మా గ్రంథము వేరు, మా జ్ఞానము వేరు, మా దేవుడు వేరు అని గోడ కట్టుకొని ఉన్న మొత్తము మానవజాతికి **దేవుడు ఒక్కడే, దేవుని జ్ఞానము ఒక్కటే** అని, మూడు దైవ గ్రంథములలో ఉన్న జ్ఞానాన్ని విజ్ఞాన సహితముగా,

సూత్రబద్ధముగా, సిద్ధాంతవరంగా ఏకం చేసి నిరూపించిన ప్రతిభావంతుడు శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు. మూడు గ్రంథాలలో లేని జ్ఞానాన్ని కూడా విజ్ఞాన సహితముగా, సిద్ధాంతానికి అనుగుణముగా వివరిస్తూ దైవానికి పూర్తి చేరువగా తీసుకుపోయిన ఘనాపాటి శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు. ఆధ్యాత్మికము అర్థము కావడానికి ఎంతో భాషా పాండిత్యము, సాహిత్యపరిజ్ఞానము, సంస్కృత భాషలో ప్రవేశము అవసరము అని భావిస్తున్న నేటి జనులకు, వాటి అవసరము ఏమాత్రము లేకుండా 'అనుభవం, నిరూపణ, శాస్త్రం' అన్న సాధారణమైన పదాల ద్వారా బ్రహ్మవిద్యా శాస్త్రాన్ని పరిచయం చేసి, ఆధ్యాత్మికంలో శిఖరాగ్రానికి చేర్చిన పరిప్రజ్ఞాశాలి శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు. పరిచయము తోనే మొత్తము ప్రపంచాన్ని తెలియజేసి, ప్రపంచేతరమైన పరమాత్మ రుచిని ఆరంభములోనే అనుభవింపజేసిన బహుముఖ ప్రజ్ఞాశాలి శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు. శాస్త్రము అంటే జరిగితీరునది. "ఒక విషయము సమర్థించుటకు శాస్త్రము ఎంత అవసరమో, ఒక విషయాన్ని ఖండించుటకు కూడా శాస్త్రము అంతే అవసరము" అన్న సూత్రాన్ని ప్రయోగాత్మకంగా నిరూపించిన ధీశాలి ప్రబోధానంద యోగీశ్వరులు.

ఆయన తెలియజేసిన త్రైత సిద్ధాంత జ్ఞానము ద్వారా ఆయన ఎవరో, ఏమిటో తెలుసుకోవడము ఉత్తమమైన మార్గము అని నా ఉద్దేశ్యము. త్రైత సిద్ధాంత జ్ఞానము మూడు దైవ గ్రంథాలైన భగవద్గీత, బైబిలు, ఖురాన్‌లను ఆధారము చేసుకొని చెప్పబడ్డదే. ఈ మూడు దైవ గ్రంథాలలో ఇమిడి ఉన్న దైవ సారాంశాన్ని తెలియడానికి ఆయన ప్రయోగించిన సాధారణమైన పదాలు "అనుభవము, నిరూపణ, శాస్త్రము". (అ) సాధారణమైన ఆ మూడు దైవ పదాలే బ్రహ్మవిద్యా శాస్త్రముగా పరిగణించబడుతున్న మూడు

గ్రంథాలలో ఉన్న జ్ఞానాన్ని కలికి, చిలికి అందులోనున్న రసాన్ని, సారాంశాన్ని పిండి, వడపోసి మనిషి హృది స్థానములో ఉన్న తత్త్వవేత్తను కదిపి, కుదిపి మనిషిని ఆధ్యాత్మిక అందలం ఎక్కించాయి. సరళమైన పద ప్రయోగంతో శాస్త్రానికి భావముతోనే సంబంధము తప్ప, భాషకు ప్రాధాన్యత లేదు అని ప్రయోగాత్మకంగా నిరూపించారు. త్రైత సిద్ధాంతము ద్వారా జ్ఞానులను ఆధ్యాత్మిక శిఖరాగ్రానికి తీసుకువెళ్ళే ఆ మూడు సాధారణమైన పదాలు 'అనుభవము, నిరూపణ, శాస్త్రము'. అవి జ్ఞానులకు ఎలా దోహదపడ్డాయో కొంత వివరించుకొందాము.

'అనుభవము, నిరూపణ, శాస్త్రము' తెలుగు భాష తెలిసిన ప్రతి పాఠకునకు సుపరిచయమైన, సాధారణమైన, సరళమైన పదాలు. ఈ మూడు పదాలను కొంచెము పరిశీలించి చూస్తే, ఒక పదముతో వేరొక పదము పరస్పర సంబంధము కలిగి ఉన్నాయి. అనుభవానికి వచ్చిన విషయము సత్యమై ఉంటుంది. సత్యమైన విషయం నిరూపించబడాలి. నిరూపించబడ్డ విషయము శాస్త్రమైతీరుతుంది. ఇది అనుభవానికి, నిరూపణకు, శాస్త్రానికి గల పరస్పర సంబంధము. ఈ మూడు పదాల పరస్పర సంబంధాన్ని వివిధ గ్రంథాలలో, వివిధ సందర్భాలలో సందర్భోచితంగా స్వామి వారు వివరించిన విధానము, వాడుకొన్న తీరు భక్తులను ఆధ్యాత్మిక శిఖరాగ్రానికి తీసుకువెళ్ళాయి అనుటలో ఎటువంటి అతిశయోక్తి లేదు. భాషలో ఎంతో పాండిత్యాన్ని గడించిన భాషాపండితులకు అర్థంకాని ఆధ్యాత్మికము, సాహితీరంగములో కొమ్ములు తిరిగిన సాహితీవేత్తలకు కూడా అంతు చిక్కని ఆత్మతత్త్వము, సంస్కృతములో ఉద్ధండులైన పండితులకు కూడా కొరుకుడు పడని ఆత్మజ్ఞానము, సాధారణ మనుషులమైన మనకు, సాధారణమైన ఆ మూడు పదాల ద్వారా స్వామి వారు అందించిన ఆత్మా

నందాన్ని ఒకసారి మననము చేసుకొందాము. సాధారణమైన, సామాన్యమైన ఆ మూడు పదాలు అసాధారణమైన, అసామాన్యమైన బ్రహ్మావిద్యా శాస్త్రాన్ని అర్థము చేసుకోవడానికి దోహదపడిన తీరు స్వామివారి ద్వారా పంచు కోవాలన్న నా తపన, ఈ చిరువ్రాత ద్వారా తీరుతుందన్నది నా ఆశ.

"అనుభవము" అను పదములో అను+భవ రెండు పదములు కలవు. 'అను' అంటే చెప్పు అనే అర్థాన్ని ఇస్తుంది. భవ అను పదము 'జరిగిన' అనే అర్థముగా ఉంది. జన్మ జరిగి ఊహ తెలిసిన దగ్గరనుండి చెప్పిన విషయాలు అన్నియూ ఐదు జ్ఞానేంద్రియముల ద్వారా తెలియబడ్డ సమాచారమే తప్ప వేరొకటి కాదు అని అనుభవము చెబుతుంది. ఐదు జ్ఞానేంద్రియముల ద్వారా అనుభవానికి వచ్చు దృశ్య, శ్రవణ, స్పర్శ, రస, గంధాదుల సమాచారము సత్యం అని చెప్పవచ్చు. ప్రపంచములో ఏ విషయమైనా సత్యం అని చెప్పుటకు శరీర పరిధిలో ఉన్న ఐదు జ్ఞానేంద్రియముల ద్వారా వచ్చు సమాచారము తప్ప వేరొకటి లేదు, కాదు. అంటే శరీర పరిధిని అతిక్రమించి ఏ విషయమైనా సత్యము అని చెప్పుటకు ఆధారము లేదు. సత్య ప్రకటనలకు శరీర పరిధిని దాటకూడదు అన్నది ఇక్కడ సత్యమై ఉన్నది. దీనినిబట్టి అనుభవము అంటే సత్యము అని, సత్యము అంటే అనుభవానికి వచ్చునది అని ఖచ్చితముగా చెప్పగలుగు చున్నాము. అనుభవము సత్యము అయినప్పుడు నిరూపణకు రావాలి కదా! మరి నిరూపణ అనే పదాన్ని స్వామివారు వివరించే విధానాన్ని ఒకసారి నెమరు వేసుకొందాము.

'నిరూపణ' అనే పదములో రూపం అంటే రూపము కలదిగా చెప్పవచ్చు. మరి నిరూపణ అంటే నిర్ధిష్టమైన రూపం లేనిదని అర్థంగా

ఉంది. రూపం లేనిదానిని నిరూపించాలి అంటే, కనీసము దాని అనుభవమైనా ఆధారముగా ఉండాలి కదా! అనుభవము ఆధారముగా ఉంటే, అనుభవాన్ని అవగాహన చేసుకొని, అవగాహనకు వచ్చిన దానిని అనుభవానికి అనుగుణముగా అవగతము చేసుకొని నిరూపించవచ్చును. అనుభవానికి వచ్చిన రూపము లేని ఎన్నో విషయాలు ప్రపంచములో నిరూపించబడ్డాయి. ఉదాహరణకు అయస్కాంత దండము యొక్క అయస్కాంత తత్త్వము ఐదు జ్ఞానేంద్రియముల ద్వారా అనుభవానికి రాదు. అలాగే ఒక రబ్బరు బంతిలో ఉన్న గాలి ఐదు జ్ఞానేంద్రియుల ద్వారా అనుభవానికి రాదు. అలా అని బంతిలో ఉన్న గాలిని, అయస్కాంతము యొక్క అయస్కాంత తత్త్వాన్ని కాదనలేము కదా! అలాగే ఒక టీవీకి, టీవీ రిమోట్‌కి ఉన్న పరస్పర సంబంధము ద్వారా అనుభవానికి వచ్చు విషయాలు ఐదు జ్ఞానేంద్రియముల వ్యవస్థ ద్వారా నిరూపించటము సాధ్యము కాదు కదా!

ఐదు జ్ఞానేంద్రియముల ద్వారా వచ్చు అనుభవమే సత్యమైనప్పుడు, ఐదు జ్ఞానేంద్రియముల ద్వారా కాకుండా ఒక విషయము శరీరము లోనికి ప్రవేశించి అనుభవానికి వస్తుందంటే ఆ అనుభవాన్ని తెలియజేసే ఇంద్రియ వ్యవస్థ శరీరములోనే ఉంది అన్న సత్యాన్ని పరోక్షముగా ఒప్పుకోక తప్పని పరిస్థితి. ప్రత్యక్ష అనుభవానికి వస్తున్న, తెస్తున్న ఆ ఇంద్రియ వ్యవస్థ ఏది? ఎక్కడ ఉంది? వాటి స్థావరము ఎక్కడ? ఐదు జ్ఞానేంద్రియముల ద్వారా ఏ విషయమైనా అనుభవానికి వస్తే, ఆ విషయ సమాచారాన్నిబట్టి, ఈ విషయము ఫలానా ఇంద్రియముల నుండి వస్తుంది, ఆ ఇంద్రియం శరీరములో ఉండి తీరాలి. అనుభవము సత్యము అయినప్పుడు, సత్యము నిరూపణకు వచ్చినప్పుడు, నిరూపణకు, శాస్త్రానికి పరస్పర సంబంధము

వుంది. ఈ సూత్రాన్ని అనుసరించి ఐదు జ్ఞానేంద్రియములను కాదని అనుభవానికి వచ్చిన విషయాలు శాస్త్రబద్దము కావాలి అంటే నిరూపించాలి. అంటే కంటి ద్వారా చూడలేని, చెవి ద్వారా వినలేని, ముక్కు ద్వారా వాసనకు కూడా దొరకని, నాలుక రుచికి అందని, చర్మము స్పర్శకు కూడా అంతు చిక్కని ఆ ఇంద్రియ వ్యవస్థనే **'అంతరేంద్రియములు'** అని బ్రహ్మవిద్యా శాస్త్రము ద్వారా తెలియబడింది. బ్రహ్మవిద్యా శాస్త్రరీత్యా శరీరాన్ని రెండు ప్రధాన భాగాలుగా విభజిస్తే ఒకటి స్థూల శరీరము, రెండు సూక్ష్మ శరీరము (స్థూల, సూక్ష్మ శరీరములు వివిధ గ్రంథాలలో, వివిధ సందర్భములలో వివరముగా తెలుపబడ్డాయి). మొదటి భాగమైన స్థూల శరీర విషయ జ్ఞానము అర్థముకావటానికి, అనుభవానికి, నిరూపణకు, శాస్త్రబద్దతలకు ఎటువంటి కష్టముపడని మనిషి, రెండవ ప్రధానభాగమైన సూక్ష్మ శరీరమునకు సంబంధించిన అంతరేంద్రియముల జ్ఞాన విషయంలో పూర్తిగా తడబడి పోయాడు. చేయకూడని తప్పిదం చేశాడు. ఇక్కడే మనిషి బ్రహ్మవిద్యా శాస్త్రాన్ని అతిక్రమించి, శాస్త్రాన్ని కాదని శాస్త్రములో లేని విషయాన్ని చెప్పడానికి ప్రయత్నించాడు. ఈ మానవ తప్పిదము వలననే దేవుని విధానమును, దేవుని మార్గమును తప్పిన మనిషి మాయ (సాతాన్, సైతాన్) మార్గములో పయనించవలసి వచ్చింది. శాస్త్రాన్ని కాదని సూత్రాన్ని అతిక్రమించి చేసిన ఏ ప్రయోగమైనా సత్ఫలితాలు పొందలేము అన్న సత్యము, ఈ రోజు త్రైత సిద్ధాంతము ద్వారా ఋజువు అయింది. అన్ని విషయాలు శాస్త్రబద్ధముగా, సూత్రబద్ధముగా సాధించగలుగుతున్న మనిషి, దేవుని విషయములో ఆ విజ్ఞతను, వివేకాన్ని ఎందుకు కోల్పోయాడు? అన్న దైవ రహస్యము త్రైత సిద్ధాంత జ్ఞానము ద్వారా మాత్రమే తెలియ సాధ్యమగును.

ప్రపంచ సంబంధ సమస్యలను, రహస్యాలను ప్రపంచ సంబంధ శాస్త్రముల ద్వారా తెలియగలుగుచున్నాము. మరి దైవ రహస్యము అంటున్నాము, కావున దైవ సంబంధ శాస్త్రమైన బ్రహ్మవిద్యా శాస్త్రములోనే చూడాలి. ఇప్పుడు ఇదే విషయము బ్రహ్మవిద్యా శాస్త్రానికి సంబంధించిన దైవ గ్రంథమైన పవిత్ర ఖురాన్ జ్ఞానము ద్వారా రూఢి పరచుకొందాము. పవిత్ర ఖురాన్ సూరా 3 ఆయత్ 7లో 'స్థూల శరీరానికి చెందిన స్థూల జ్ఞానాన్ని మనిషి చెప్పగలడు కానీ సూక్ష్మ శరీరానికి సంబంధించిన సూక్ష్మ జ్ఞానాన్ని ఏ మనిషి చెప్పలేడు.' అన్న సారాంశాన్ని తెలియజేసే వాక్యము కలదు. పవిత్ర ఖురాన్ ధర్మశాస్త్రాన్ని తెలియజేసే గ్రంథముగా పరిగణించ బడింది. శాస్త్రాన్ని అతిక్రమించి, సూత్రాన్ని కాదని చేసిన ఏ ప్రయోగమైనా, కార్యమైనా సత్ఫలితాలు ఇవ్వదు అన్న జ్ఞానాన్ని అనుసరించకుండా, మనిషి సూక్ష్మశరీరానికి జ్ఞానాన్ని చెప్ప ప్రయత్నించాడు. శాస్త్రాన్ని అతిక్రమించి చేసిన ప్రయత్నానికి ఈ రోజు మానవ జాతి మొత్తము ఆత్మ జ్ఞానానికి దూరము అయింది.

స్థూల శరీరములో ఒక భాగమైన జ్ఞానేంద్రియములను కాదని, అనుభవానికి వచ్చే విషయాలు శరీరములోనే అంతరేంద్రియముల ద్వారా తెలుస్తుంది అన్నది ఒక్క త్రైత సిద్ధాంత జ్ఞానములోనే శాస్త్రబద్ధముగా, నిరూపణాత్మకంగా చెప్పబడింది. ఆ అంతరేంద్రియ వ్యవస్థే శరీరములో మనస్సు, బుద్ధి, చిత్తము, అహం, జీవుడుగా పేర్కొనబడ్డాయి. ఈ అంతరేంద్రియ వ్యవస్థకు సంబంధించిన జ్ఞాన విషయములో మానవుడు పూర్తిగా పెడత్రోవపట్టాడు. అడ్డదారులు త్రొక్కాడు. ఆధ్యాత్మికాన్ని అక్రమ మార్గాలను పట్టించాడు. నిజమైన ఆత్మజ్ఞానాన్ని తద్వారా ఆత్మను తెలియ వలసిన, సహకరించవలసిన అంతరేంద్రియ వ్యవస్థను చిన్నాభిన్నం చేశాడు.

మనిషికి అంతరేంద్రియములు మనసు, బుద్ధి, చిత్తము, అహము, జీవుడు అని కొంత సమాచారము తెలిసినప్పటికీ, శరీరములో వాటి విధానము, వాటి స్థావరము చూడలేక పోయాడు. ధర్మశాస్త్రాన్ని కాదని చేసిన మానవ తప్పిదానికి మనిషి కొన్నివేల, లక్షల సంవత్సరముల నుండి శాస్త్రబద్ధమైన దైవజ్ఞానానికి దూరము అయ్యాడు.

దేవుడు, దైవము అన్న పదాలు మాటలకే పరిమితము అయ్యాయి తప్ప దైవత్వాన్ని అనుభవించడానికి నాటి జ్ఞానము (క్రీస్తు పూర్వము) గానీ, ఆత్మతత్త్వాన్ని తెలియడానికి నేటి జ్ఞానము (క్రీస్తు శకము) గానీ, ఏమాత్రము దోహదపడలేకపోయాయి. ఆ లోటును తీర్చడానికి నేడు త్రైతశకం ఆరంభము అయింది. త్రైత శకంలో తెలియబడ్డ త్రైత సిద్ధాంతము బ్రహ్మ విద్యా శాస్త్రములో ఉన్న బ్రహ్మత్వాన్ని సమూలంగా బహిరంగపరుస్తోంది.

బ్రహ్మత్వాన్ని తెలియడానికి, ఆత్మతత్త్వాన్ని అనుభవించడానికి అవసరమైన సహాయ సామాగ్రి సృష్టి ఆదిలోనే మనిషి శరీరములోనే అంతరేంద్రియ వ్యవస్థగా దేవుడు అమర్చి పెట్టాడు. మనిషి వాటిని గుర్తించ లేకపోయినా, తెలియలేకపోయినా ప్రకృతి మాత్రము తన పని తాను చేసుకుంటూ పోతుంది. కాలస్వరూపుడుగా ఉన్న దేవుడు కాలాన్ని నడుపుతూనే ఉన్నాడు. కాలచక్రములో మనిషి (జీవుడు) నలుగుతూనే ఉన్నాడు. అలా వేల సంవత్సరములుగా ప్రయాణిస్తున్న కాలగమనంలో త్రైతశకము ఆరంభము అయింది. త్రైత సిద్ధాంతము ఆవిర్భవించింది. త్రైత సిద్ధాంత జ్ఞానములో అంతరేంద్రియములు అనే ఆయుధ సామాగ్రికి పదును పెట్టబడింది. పదును పెట్టబడిన ఆయుధాలను, వాడవలసిన తీరును, విధానాన్ని శాస్త్రబద్ధముగా త్రైత సిద్ధాంతము వివరించింది. వివరించిన విధానం ప్రకారము మనిషి ఆయుధాలను ఉపయోగించడము

జరిగింది. ఆయుధాలను ప్రయోగించిన ప్రథమాంకంలోనే అనుభవానికి వచ్చిన ఫలితాలే, త్రైత సిద్ధాంతము శాస్త్రబద్దత కలిగి ఉంది అని నిరూపించ బడింది. బ్రహ్మవిద్యా శాస్త్రములో ఏ ప్రశ్నకైనా ఎటువంటి సంశయమునకైనా ఎదురాడని సమాధానము చెప్పగలదన్న ధైర్యాన్ని, స్థైర్యాన్ని, విశ్వాసాన్ని త్రైత సిద్ధాంతము కల్పించింది. సూక్ష్మశరీరములో ప్రధాన భూమిక వహిస్తున్న అంతరేంద్రియ వ్యవస్థలో ఒక ప్రధానమైన అంతరేంద్రియము మనస్సు. శరీరములో మనస్సు యొక్క విధి విధానము, పనితనము ఏమిటి? మనస్సు యొక్క స్థావరము శరీరములో ఎక్కడ? ప్రతిరోజు అనేక సందర్భములలో మనస్సు అనే మాటను ఉచ్ఛరిస్తూ, మనస్సు యొక్క పనితనాన్ని అనుభవిస్తూ ఉన్నాము. అయినా మనస్సుకు సంబంధించిన జ్ఞానము తెలియటంలో శాస్త్రబద్ధతను కోల్పోయాము. ఒక స్థూల జ్ఞానేంద్రియమైన చెవి స్థావరము శరీరములో ఫలానా చోట ఉంది, దాని పని తనము ఇది అని ఖచ్ఛితంగా, నిరూపణగా చెప్పగలిగిన మనిషి, సూక్ష్మ శరీర భాగమైన మనస్సు అనే ఇంద్రియ స్థావరాన్ని, పనితనాన్ని ఎందుకు చెప్పలేకపోయాడు? అంటే దైవగ్రంథాన్ని కాదనీ, ధర్మశాస్త్రాన్ని కాదనీ, మనిషి ఏమీ చెయ్యలేడు అన్నది ఇక్కడ నిరూపణగా తెలియబడుతుంది. మీరు ఇక్కడ ఒక ప్రశ్న వేయడానికి అవకాశము ఉంది. త్రైత సిద్ధాంతము ద్వారా నిరూపణగా తెలియబడ్డ విషయము, మనిషి చెప్పే జ్ఞానము ద్వారా, మనిషి వ్రాసే గ్రంథాల నుండే తెలుసుకొంటున్నాము కదా! మనిషి వ్రాసే గ్రంథాలనే కదా! ధర్మశాస్త్రంగా పరిగణిస్తున్నాము అన్న ప్రశ్నకు యోగీశ్వరుల వారు ఎన్నో ప్రసంగాలలో వివిధ గ్రంథాలలో శాస్త్రబద్ధమైన, నిరూపనాత్మకమైన వివరాన్ని అందించారు. ఆ విషయమై మనము ఇక్కడ ప్రస్తావించుకోవడము అసమంజసంగా ఉంటుంది, కాకపోతే సందర్భము వచ్చింది కాబట్టి సూచనప్రాయంగా

తెలియజెయ్యాలి అనుకొంటున్నాము. దైవజ్ఞానము మూడు విధములుగా మాత్రమే తెలియబడుతుంది అన్న పవిత్ర ఖురాన్ 42వ సూరా 51వ ఆయత్ ప్రకారము మూడు విధానములలో ఒక విధానము అయిన **"దేవుడు తన ప్రతినిధిని పంపి తన జ్ఞానాన్ని చెప్పును"** అన్న దైవసందేశాన్ని అనుసరించి త్రైత సిద్ధాంతము ద్వారా నిరూపణకు వస్తున్నది. మరి నిరూపణకు తెస్తున్న త్రైత సిద్ధాంత జ్ఞానము చెప్పుచున్నది ఎవరు? స్వామివారు ఎవరు? అన్న ప్రశ్నలకు జవాబులు పాఠకుల విజ్ఞతకు, వివేకానికి, దేవుని ఇష్టాఇష్టాలకు వదిలివేద్దాము.

ధర్మశాస్త్రములో ఒక దైవగ్రంథము అయిన పవిత్ర ఖురాన్‌లో మూడవ సూరా ఏడవ ఆయత్ (3-7) లో ఉన్న జ్ఞానాన్ని కాదని చేసిన ప్రయత్నానికి (తప్పిదానికి) దైవత్వము తెలియకుండా పోతే, మూడు దైవ గ్రంథములలో ఉన్న మొత్తము జ్ఞానము తెలియాలి అంటే దేవుడు అనే పదము ఉచ్ఛరించటానికి కూడా మానవునకు అర్హత లేదు అనిపిస్తుంది. మూడు గ్రంథాలలో ఎన్నో సూక్ష్మ విషయాలు ఉన్నాయి. వాటికి అసలు వివరము తెలియని రచయితలు, బోధకులు అనవసరమైన వివరాన్ని అందించారు. జ్ఞానాన్ని అక్రమ మార్గాలు పట్టించారు. అర్థము కాకుండా చేశారు. శాస్త్రంగా పరిగణించబడుతున్న బ్రహ్మవిద్యా శాస్త్రాన్ని శాస్త్రమే కాదు అన్న పరిస్థితికి తీసుకువచ్చారు. దేవుని జ్ఞానముతోనే జీవించవలసి యున్న జీవున్ని అజ్ఞానముతో కప్పేశారు. పరమాత్మ జ్ఞానముతో ప్రశాంతముగా జీవించవలసిన జీవున్ని, ప్రకృతి జ్ఞానముతో ఊపిరాడని పరిస్థితికి తెచ్చారు. ఇటువంటి గడ్డు పరిస్థితిలో జీవునికి ఊపిరి సలిపింది త్రైత సిద్ధాంతము. అజ్ఞానపు అంధకారంలో మగ్గిపోతున్న బ్రహ్మవిద్యా శాస్త్ర ఉనికిని ప్రకాశవంతము చేసింది త్రైత సిద్ధాంతము. మనిషి (జీవుడు)

త్రైత జ్ఞాన వెలుగులోనే మొట్టమొదట 'మనసు' అనే ఇంద్రియము యొక్క నిజ స్వరూపాన్ని గుర్తించాడు. 'మనసు' యొక్క నిజస్వరూపం తెలిసిన మనిషికి దేవుని మార్గము సుగమం అయింది. మనసు యొక్క వాస్తవ పనితనము అనుభవానికి వచ్చింది.

శరీరములో ప్రధాన భాగమైన సూక్ష్మశరీరములో అంతరేంద్రియ వ్యవస్థలో ఒక ఇంద్రియమైన మనసుకు సంబంధించిన జ్ఞానము, ఆధ్యాత్మికాన్ని అనుభవ పూర్వకంగా, నిరూపణాత్మకంగా అర్థము చేసుకోవటానికి పునాదిగా భావించవచ్చు. మనసుకు సంబంధించిన జ్ఞానము త్రైత సిద్ధాంతానికి సంబంధించిన వివిధ గ్రంథాలలో యోగీశ్వరుల వారు వివరించిన విధానము, వివిధ ప్రసంగాలలో ప్రస్తావించిన తీరు అమోఘము అద్భుతము. గ్రంథములో మనసుకు సంబంధించిన జ్ఞానాన్ని చదివి, అర్థము చేసుకొని, అనుభవించటమే తప్ప, మనుషులెవ్వరూ చెప్ప సాధ్యము కాని పని. అద్దములో మన ప్రతిబింబము చూసి మురిసి పోయిన విధంబున జ్ఞానములో మనసు ప్రతిబింబిస్తుంటే, జీవుడుగా నేను మురిసిపోయిన విధము అప్పుడు ఎవరికీ చెప్ప సాధ్యము కాలేదు కానీ ఈ వ్రాత ద్వారా నా ఈ కోరిక ఇప్పుడు తీరుతుంది. అనుభవానికి వచ్చి, నిరూపణకు రాని మనసు, యోగీశ్వరుల వారి జ్ఞానము ద్వారా నిరూపణకు వస్తే, ఇంత మురిసిపోతే, అనుభవానికి, నిరూపణకు రాని ఆత్మ అనుభవానికి వచ్చి, నిరూపించబడితే నువ్వు ఈ భూమిమీద ఉంటావా! ఒక్కసారి ఊహించు. ఒక్క మనసు విషయములోనే ఎంతో సాధించాను, సంపాదించాను అని ఇంత పొంగిపోతే, అసలు సిసలు అయిన ఆత్మ వివరము తెలియాలి అంటే ఇంకా నాలుగు ఇంద్రియముల వివరము సవివరముగా తెలియాలి.

మూడు యోగ సూత్రాలలో ఒక యోగ సూత్రాన్ని సిద్ధాంతబద్ధముగా నిరూపించాలి అంటే మనుసుకు సంబంధించిన మరికొంత సమాచారాన్ని త్రైత సిద్ధాంత జ్ఞానము ద్వారా సేకరించాలి. శరీరములో మనసు యొక్క విధి విధానాన్ని అవగతము చేసుకొన్న మనిషి (జీవుడు), దానిని నియంత్రించి బలహీన పరచి, పూర్తిగా నిర్వీర్యం చేస్తే, జీవుడు పొందే అనుభూతే బ్రహ్మయోగము అని తెలిసాడు. అనుభూతి అనుభవము అని అంటున్నారు. జ్ఞానయోగము ద్వారా ఎప్పుడైనా ఆత్మానుభవాన్ని పొందారా? అని మీరు ప్రశ్నించవచ్చు. మసాలా పట్టిన పదార్థాన్ని వంటకం చేసిన సమయంలో వచ్చిన వాసన ద్వారా తినకుండానే ఆ పదార్థాన్ని అనుభవిస్తున్నాము. ఎన్నో ప్రయోగాల శాస్త్రీయతను తెలియకుండానే అది సత్యం అని అనుభవము ద్వారా రూఢిపరుస్తున్నాము. జ్ఞాన యోగ సూత్రం శాస్త్రబద్ధముగా అర్థము అయ్యే తరుణంలోనే, దాని ఫలితము జీవుడికి అనుభవానికి వస్తుందంటే, జీవునితో కూటస్థుడుగా ఉన్న ఆత్మ, జీవునికి ఆ అనుభవాన్ని అందించి ఉండవచ్చునేమో, ఆ కూటస్థునికే తెలియాలి. శ్రద్ధ ఉంటే మీరు ప్రయత్నించుకొని దైవానుభూతిని పొందండి. ఆత్మతత్వాన్ని అనుభవించటానికి, దేవుని దరి చేరడానికి తెలియబడ్డ మూడు ధర్మాలలో ప్రధానమైన ధర్మము మనసుతోనే ముడిపడి ఉంది అన్న శాస్త్రీయతను అనుభవానికి రప్పించిన స్వామివారు ఎవరు? సందర్భానుసారము స్వామివారు ఎవరు? స్వామి వారు ఎవరు? అన్న పశ్నలు “దేవుడు మూడవ విధానము ద్వారా తన ప్రతినిధిని పంపును” అన్న దైవసందేశాన్ని రూఢిపరచుటకు, స్వామి వారినే ఆ ప్రతినిధి అని మీకు పరోక్షముగా చెప్ప ప్రయత్నిస్తున్నట్లు ఉంది అని మీరు భావించవచ్చు. ఒక ఆసక్తిని రేకెత్తించి, ఒక ఆశను కల్పించి త్రైత సిద్ధాంత గ్రంథాలను చదివించే ప్రయత్నము అని భావించవచ్చును.

నా అనుభవపూర్వకంగా చెప్పుచున్నాను. మీరు అటువంటి ఆశలు పెట్టుకోవద్దు, ఎటువంటి ఆసక్తిని పెంచుకోవద్దు. నేను మొత్తము గ్రంథాలను, ప్రసంగాలను ఒకటికి రెండు, మూడు పర్యాయములు చదవడం, వినడం జరిగింది. గ్రంథాలను చదువుతూ, జ్ఞానాన్ని అనుసరిస్తూ స్వామి వారిని గుర్తు పట్టాలని ప్రయత్నించినా గ్రంథాలలో గానీ, ప్రసంగాలలోగానీ ఎటువంటి ఆధారము లేదు. ఆయన తెలివిగా మనలను దారి తప్పిస్తాడు. మార్గము తప్పిన మనిషిని (జీవున్ని) నేరుగా శరీరములోనికి దారి మళ్లిస్తాడు. దారి మళ్లిన మనిషి మునుపెన్నడూ కనని, వినని, చవిచూడని విధానాన్ని స్వామివారి గ్రంథాలలో చూస్తాడు. గతమెన్నడూ ఎరుగని, అనుభవించని అనుభూతిని పొందుతాడు. గ్రంథాలలో ఉన్న థియరీని (Theory) నిరూపించుటకు ఆయన శరీరాన్నే ప్రయోగశాలగా మార్పిస్తాడు. గ్రంథాలలో ఉన్న సత్యాసత్యాలను రూఢిపరచుకొనుటకు మనిషిని శరీరము లోపలికి జొప్పించి అణువణువునా అన్వేషింపజేస్తాడు. శరీర పరిధి లోపలనే అనంత విశ్వాన్ని ఆవిష్కరింపజేస్తాడు. ఆనాడు అర్జునుడు ఒక్కడికే భగవద్గీత బోధ ద్వారా విశ్వరూపాన్ని చూపిన కృష్ణుడు, ఈనాడు మూడు దైవగ్రంథముల ఆధారముతో తెలియబడ్డ త్రైత సిద్ధాంత బోధ ద్వారా సమస్త మానవులకు అదే విశ్వరూపాన్ని స్వామివారు ఆవిష్కరింపజేయుచున్నారు. ప్రథమ దైవగ్రంథము భగవద్గీతలో ఉన్న మొత్తము జ్ఞానము, ద్వితీయ దైవగ్రంథము నాలుగు సువార్తలలో ఉన్న మొత్తము వాక్యములు, అంతిమ దైవగ్రంథములో ఉన్న మొత్తము ఆయత్‌లలో ఉన్న జ్ఞానము శరీర పరిధి లోపలిదే అని విజ్ఞాన సహితముగా నిరూపించింది త్రైత సిద్ధాంతము. ఇన్ని ఆధ్యాత్మిక అనుభవాలు, ఎన్నో తత్త్వ సంబంధ సంశయాలకు సమాధానాలు శరీరము లోనే లభ్యమైన తరుణంలో, శరీరము నుండి ఉత్పన్నమైన ప్రశ్న స్వామివారు

ఎవరు? అంతే తప్ప నాకు నేనుగా వ్యక్తిగతంగా, శాస్త్రాధారము లేకుండా వేస్తున్న ప్రశ్న కాదు.

ఆ ప్రశ్నను ప్రక్కన పెట్టి జ్ఞాన విషయమును చూస్తే శరీరము లోపలికి చొరబడిన మనిషి (జీవుడు) మనసు యొక్క పనితనము, విధి విధానము అనుభవపూర్వకముగా అర్థము చేసుకొన్నాడు. ఐదు జ్ఞానేంద్రియముల ద్వారా వచ్చు విషయ సమాచారమును మనసే జీవుని దగ్గరకు తీసుకొని పోతుంది అన్న సత్యాన్ని అనుభవపూర్వకంగా రూఢి పరచుకొన్నాడు. ప్రపంచ విషయాలకు సంబంధించి మనిషికి సమస్య ఎక్కడ ఉత్పన్నమయ్యిందో, అక్కడే మనిషి మేధస్సు (బుద్ధి) పని చేయడం ప్రారంభించింది. తద్వారానే ప్రపంచ విజ్ఞానం తెలియబడింది. ఇదే సూత్రాన్ని అనుసరించి దైవాన్ని తెలియటానికి ఐదు జ్ఞానేంద్రియ విషయాలే అడ్డంకిగా ఉన్నాయి అన్న సత్యాన్ని మనిషి (జీవుడు) అనుభవపూర్వకంగా గ్రహించాడు. ఐదు జ్ఞానేంద్రియ విషయాలను మనసు జీవుని దరికి తీసుకొనిపోవుటకే తప్ప ఆ విషయములో ఉన్న మంచి, చెడులను గ్రహించే శక్తి మనస్సుకు లేదు. అది మనసు పని కాదు అని తెలియలేక పోయాడు. మనసు తీసుకొని పోయిన విషయాలలో ఉన్న మంచి, చెడులను ఆలోచనలు లోచనలు అన్న ప్రక్రియలు బుద్ధి చేస్తుంది అన్న బ్రహ్మవిద్యా శాస్త్ర జ్ఞానాన్ని అందుకోలేకపోయాడు. అంతరేంద్రియ వ్యవస్థలో అతి ప్రధానమైన అనుభవానికి వస్తున్న రెండు ఇంద్రియాలలోనే మనిషి పూర్తిగా తడబడి పోయాడు. మిగతా రెండు ఇంద్రియముల విధి విధానము, పనితనము నేరుగా తెలియటానికి అవకాశమే లేదు.

నిత్య జీవితములో అనేక సందర్భాలలో మనసు, బుద్ధి అన్న పదాలు దొర్లిపోతున్నా వాటి విధి విధానాన్ని శాస్త్రబద్ధంగా తెలియలేకపోయాడు.

మనసుకు సంబంధించిన కవితలు, కావ్యాలు వ్రాసిన కవులు సహితము మనసుని శాస్త్రబద్ధంగా వివరించలేకపోయారు. దైవజ్ఞానము తెలిసిన పెద్దలము అని చెప్పుకొన్న వారు కూడా శరీరములో మనసు, బుద్ధి యొక్క ఉనికిని గుర్తించలేకపోయారు. ఆధ్యాత్మికాన్ని అధ్యయనం చేసిన గురువులము, స్వాములము, బోధకులము అని పీఠాలు, మఠాలు ఏర్పరచు కొన్న వారు సహితము మనసు, బుద్ధికి ఉన్న పరస్పర సంబంధాన్ని అనుభవానికి రప్పించలేకపోయారు. గంటలు, రోజులు, నెలల తరబడి ఊక దంపుడు ఉపన్యాసాలకే పరిమితము అయ్యారు తప్ప అంతరేంద్రియ వ్యవస్థను అనుభవానికి రప్పించలేకపోయారు. అనుభవానికి రాని ఆత్మను అంతరేంద్రియ వ్యవస్థ సహకారముతో అనుభవించవచ్చును అన్న విచక్షణను కోల్పోయారు. దీనికంతటికీ ప్రధాన కారణము మూడు దైవగ్రంథములలో చెప్పబడ్డ జ్ఞానము మొత్తము శరీర అంతర్గతంగా చెప్పబడింది అన్న యదార్థాన్ని గ్రహించకపోవడము వలన జరిగినది. ఈ విషయం నేడు త్రైత సిద్ధాంతము ద్వారా వెల్లడి అయ్యింది. మూడు దైవ గ్రంథాలలో ఉన్న జ్ఞానాన్ని ఏకీకృతము చేసి, త్రైత సిద్ధాంత గ్రంథాలుగా మలచి, ఆ గ్రంథాలనుండి మనిషి దృష్టిని శరీరము లోపలికి మళ్ళించి, శరీరం లోపల నున్న అంతరేంద్రియ వ్యవస్థను మేల్కొలిపి అనుభవింపజేసి, నిరూపించి, శాస్త్ర సమ్మతం చేసింది త్రైత సిద్ధాంతము.

ధర్మసంస్థాపన మొనర్చుటకు దేవుడు ద్వాపరయుగ అంత్య కాలాన్ని ఆరంభదశగా ప్రారంభించాడు. అప్పటి నుండి దేవుడు తాను నిర్దేశించు కొన్న విధానాల ప్రకారంగా, వివిధ కాలాలలో, వివిధ ప్రదేశాలలో తన జ్ఞానాన్ని తెలియజేస్తూ వస్తున్నాడు. ప్రథమ దశలో ప్రథమ దైవ గ్రంథముగా భగవద్గీతలో తనను చేరుకొనే మార్గాన్ని సూచించాడు. సూచించిన

మార్గములో "యోగము" అనే విధానాన్ని ప్రవేశపెట్టాడు. యోగము అనే మార్గమును మూడు విధానాలుగా ప్రవేశపెట్టాడు. ఆ మూడు విధానాలే నేడు **జ్ఞానయోగము, కర్మయోగము, భక్తియోగములు**గా ఉన్నాయి. ఈ మూడు విధానాలు నోటి మాటలకే పరిమితం అయ్యాయి తప్ప, నేటి కాలంలో వాటి విధానాన్ని ఎవరూ తెలియలేదు. ఫలితాన్ని ఎవరూ పొందలేదు. భగవద్గీతలో ఈ మూడు విధానాలు సూత్రబద్ధంగా తెలియబడ్డాయి. గీతలో తెలియబడ్డ మొత్తము శ్లోకముల జ్ఞానమంతయూ మనిషిని ఈ మూడు మార్గాలలో ఉంచటానికే తెలియబడింది. భగవద్గీతకు భాష్యం చెప్పిన ఉద్ధండులకే యోగము యొక్క స్వరూపం తెలియలేదు. ఒకరికి ఒక విషయము తెలియదు అని విమర్శించటముకన్నా, ఆ విషయము తెలియలేక పోవటానికి గల హేతువుని తెలియటం ఉత్తమమైన విధానము. త్రైత సిద్ధాంతము యొక్క విధానమే హేతుబద్ధముగా ప్రశ్నించటము, శాస్త్రబద్ధముగా సమర్ధించటం. ఆ విధానాన్ని అనుసరించే మూడు యోగ సూత్రాలను సిద్ధాంతబద్దంగా త్రైత సిద్ధాంతము సిద్ధీకరించిన విధానాన్ని ఒకసారి పునఃసమీక్షించుకొని ధృవీకరించుకొందాము.

శరీర నిర్మాణాన్ని శాస్త్రబద్ధంగా తెలియలేని మనిషి దేవుని ధర్మాన్ని తెలియలేడు. దేవుని ధర్మాన్ని తెలియలేని మనిషి దేవున్ని తెలియలేడు. దేవుని ధర్మము యోగరూపంలో ఉంది అని త్రైత సిద్ధాంతము నిరూపించింది. బ్రహ్మవిద్యా శాస్త్రానికి సంబంధించిన ప్రథమ దైవ గ్రంథము భగవద్గీత కర్మయోగము 3వ శ్లోకములో రెండు మార్గాలను సూత్రబద్ధముగా సూచించినప్పటికీ, సాంఖ్య వివరము తెలియలేని మనిషి యోగ మార్గాన్ని తప్పిపోయాడు. ఒక మాట లేదా మంత్రమును తెలుపుటకు నోరు అనే ఇంద్రియమును వాడతాము. కార్యములు లేదా పనులు చేయుటకు చేతులు,

కాళ్ళు అనే ఇంద్రియాల సహాయంతో చేస్తాము. ఒక దృశ్యాన్ని చూడటానికి, ఒక శబ్దాన్ని వినటానికి, ఒక పదార్థము యొక్క వాసన, రుచులను తెలియటానికి ఆయా సంబంధిత ఇంద్రియములు వాటి సంబంధ పనులు చేస్తున్నాయి. ఈ సమాచారాన్ని బట్టి స్థూల శరీర సంబంధ ఇంద్రియముల పనితనాన్ని, సంబంధిత జ్ఞానాన్ని మనిషి స్వతహాగా తెలియవచ్చు అని రూఢి అవుతుంది. యోగము అన్న ప్రక్రియ శరీరములో అంతరేంద్రియ వ్యవస్థ ద్వారా జరుగుతుంది. ఈ విషయాన్ని శాస్త్రము ద్వారా తెలియాలి తప్ప మనిషి స్వతంత్రంగా తెలియలేడు. యోగ శాస్త్రంగా తెలియబడుతున్న మూడు దైవ గ్రంథాలలో యోగ సూత్రాలు ఉన్నాయే తప్ప, సూత్రాలను సిద్ధాంత బద్దంగా నిరూపించు విధానము లేదు. యోగము అనుభవానికి వస్తుంది. అనుభవాన్ని నిరూపించలేకపోతే 'శాస్త్రం' అని చెప్పటానికి ఆటంకం ఏర్పడుతుంది.

మూడు యోగ సూత్రాలను సిద్ధాంతబద్ధముగా నిరూపించింది త్రైత సిద్ధాంతము. మూడు దైవగ్రంథాలను ధర్మశాస్త్రముగా నిరూపించి ధృవీకరించింది త్రైత సిద్ధాంతము. ధృవీకరించబడిన త్రైత సిద్ధాంతము నుండి మూడు యోగ సూత్రాలను మరొకసారి పునఃసమీక్షించుకొందాము. కర్మయోగము, 3వ శ్లోకములో...

***శ్లో॥ 3. లోకేస్మిన్ ద్వివిధా నిష్ఠా పురాప్రోక్తా మయానఘ! ।***
***జ్ఞాన యోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం ॥***

**భావము :- లోకములో నన్ను చేరుకోనే మార్గాలు రెండే కలవు.**

**1) సాంఖ్య వివరము తెలిసినవాడు జ్ఞానయోగము ద్వారా**

**2) కార్య వివరము తెలిసినవాడు కర్మయోగము ద్వారా**

పై శ్లోకములో రెండు యోగముల యొక్క సూత్రములు ఇమిడి ఉన్నాయి. ఇమిడి ఉన్న శ్లోకములను సిద్ధాంతవరంగా నిరూపించాలి అంటే, సూత్రములో ఉన్న కండీషన్ అర్థము అవ్వాలి. దీనికి ముందు సూత్రానికి, సిద్ధాంతానికి గల పరస్పర సంబంధాన్ని శాస్త్రబద్ధంగా తెలియాలి. ఈ రెండు పదాల స్వరూపాన్ని గణిత, భౌతిక శాస్త్ర సంబంధముగా ఒక అవగాహనకు వద్దాము. సూత్రము, సిద్ధాంతము గణిత, భౌతిక సంబంధముగా మనకు పరిచయమైనవే.

**1) సూత్రము** (Principle) :- ఒక సూత్రములో కొన్ని రాశులు లేదా అంశాలు (Factors) ఒక గణిత లేదా భౌతిక శాస్త్ర సంబంధ నియమానికి కట్టుబడి ఉండటాన్ని సూత్రముగా చెప్పవచ్చు.

ఉదా :- 1) వైశ్యాలము = పొడవు × వెడల్పు -> A = l x b

2) బలము = ద్రవ్యరాశి × త్వరణం -> F = m x a

పై రెండు ఉదాహరణలను పరిగణించి సిద్ధాంతాన్ని నిర్వచిద్దాము.

**2) సిద్ధాంతము :-** ఒక సూత్రములో '=' కి ఇరువైపులా ఉన్న రాశుల గణిత లేదా భౌతిక శాస్త్రసంబంధాన్ని 'సత్యము' అని నిరూపించటాన్ని సిద్ధాంతముగా చెప్పవచ్చును.

ఒక సూత్రాన్ని, సిద్ధాంతముగా నిరూపించటానికి ఆ సిద్ధాంతాన్ని మూడు ప్రధాన భాగాలుగా విభజించటం మన అందరికీ గణిత శాస్త్రములో అనుభవమే. మనసులో నమోదు కాబడిన ఆ అనుభవాన్ని సందర్భోచితముగా ఒకసారి మననం చేసుకుందాము. ఒక సూత్రాన్ని సిద్ధాంతవరంగా నిరూపించటానికి ఆ సిద్ధాంతాన్ని మూడు ప్రధాన భాగాలుగా చేస్తారు. అవి 1) దత్తాంశం, 2) సారాంశం, 3) ఉపపత్తి లేదా నిరూపణ. గణిత

శాస్త్రానికి సంబంధించిన ఎన్నో సూత్రాలను సిద్ధాంతవరంగా నిరూపణ చేశాము. ఆ మూడు భాగాలను వాటి పనితనము ద్వారా ఒకసారి వివరముగా తెలుసుకొందాము.

**1) దత్తాంశము :-** ఒక సూత్రములో ఉన్న రాశులను (Factors) దత్తాంశముగా చెప్పవచ్చును.

**2) సారాంశము :-** ఒక సూత్రములో నిరూపించవలసిన విషయాన్ని సారాంశముగా చెపుతారు.

**3) ఉపపత్తి లేదా నిరూపణ :-** నిరూపించవలసిన సూత్రములో ఉన్న రాశుల యొక్క పరస్పర సంబంధాన్ని అర్థము చేసుకుంటూ, రాశుల పరస్పర సంబంధానికి అనుగుణముగా వస్తున్న ఫలితాన్ని అవగతము చేసుకుంటూ, వస్తున్న ఫలితము సూత్రబద్ధముగా ఉంటే, ఆ సూత్రాన్ని సత్యము అని నిరూపణగా అంగీకరిస్తున్నాము.

పై విధానమంతయూ ప్రపంచ సంబంధ శాస్త్రాల సూత్రాలకు, సిద్ధాంతాలకు సంబంధించినది. మనిషి కొంచెము లోతుగా, భిన్నముగా అర్థము చేసుకోవలసిన అవసరము ఇప్పుడు ఏర్పడినది. బ్రహ్మత్వాన్ని తెలుసుకుని, దైవత్వాన్ని అనుభవించే సమయము ఆసన్నమైంది. దేవుని విధానములో శ్రద్ధను వినియోగించవలసిన తరుణమిది. కాబట్టి జాగ్రత్తగా వినండి. ఇంతవరకు ప్రపంచ సంబంధ శాస్త్రాల సూత్రాలకు మాత్రము పై విధానములో వివరించుకున్న మూడు అంశాల సిద్ధాంత నిరూపణలు ఉన్నాయి. కానీ దేవున్ని తెలియటానికి సంబంధించిన బ్రహ్మవిద్యా శాస్త్రములో సూత్రాలు తప్ప సిద్ధాంతాలు లేవు అని అర్థము చేసుకోవాలి. మూడు దైవగ్రంథాలలో ఉన్న జ్ఞానమంతయూ సూత్రబద్ధమే తప్ప పైన

చెప్పుకున్న విధంగా సిద్ధాంతబద్ధము కాదు. మూడు దైవ గ్రంథాలలో ఉన్న సూత్రాలకు సిద్ధాంతమే నేటి **త్రైత సిద్ధాంతము.** సూత్రానికి, సిద్ధాంతానికి ఉన్న పరస్పర సంబంధాన్ని అర్థము చేసుకోండి. "సిద్ధాంతము" అంటే సూత్రములో ఇమిడి ఉన్న సారాంశాన్ని విలీనము చేసుకునేది. ఒక సూత్రము సిద్ధాంతబద్ధంగా తెలిసిన వాడు, ఆ సూత్రాన్ని ఎలా మార్చినా దాని ధర్మము కోల్పోదు. ధర్మము కాలానుగుణముగా మారునది కాదు. ధర్మము అనే పదానికి శాస్త్రబద్ధమైన నిర్వచనాన్ని పొందండి. తద్వారా దాని భావాన్ని గ్రహించండి. నేడు ధర్మము అనే మాటకు అర్థాన్ని, భావాన్ని సంతలో చింతపండు మాదిరి చేసేశారు. ఉన్నత పాఠశాల స్థాయి నుండి భౌతిక, రసాయన శాస్త్రాల ద్వారా 'ధర్మము' అనే పదానికి సరియైన భావాన్ని పొందటానికి అవకాశము ఉన్నా, కనీస శ్రద్ధ, విచక్షణ లేని మనిషి ధర్మాన్ని ఆధ్యాత్మిక విధానములో ఖూనీ చేసేశాడు. బజారులో దళారీల మాదిరి ధర్మాన్ని అమ్మేశారు. ధర్మము అని పేరు చెప్పి అధర్మాన్ని బోధించారు. న్యాయానికి ధర్మానికి తేడాను తెలియలేకపోయారు. నీతికి, జ్ఞానానికి గల తేడాను గ్రహించలేకపోయారు. మంచికి, ధర్మానికి గల భేదాన్ని పసిగట్టలేక పోయారు. శాస్త్రబద్ధత అంటే వారూ తెలియలేకపోయారు. మనకు తెలపలేక పోయారు. ఇప్పటికైనా మేల్కొనండి ధర్మానికి, అధర్మానికి శాస్త్రబద్ధమైన వివరణను, అవగాహనను పొందటానికి **"ధర్మము-అధర్మము"** అనే త్రైత సిద్ధాంత గ్రంథాన్ని చదవండి. భగవద్గీతలో ఏ శ్లోక భావాన్ని అయినా త్రైత సిద్ధాంతముతో అనుసంధానించండి. అది ఏ శ్లోకము అయినా త్రైత సిద్ధాంతములో కలిసిపోతుంది. పరిశుద్ధ బైబిలు నాలుగు సువార్తలలో ఏ వాక్యమునయినా త్రైత సిద్ధాంతముతో అనుసంధానించండి. సముద్రములో కలిసిన నీటి ప్రవాహం మాదిరి ఆ వాక్యం తన ధర్మాన్ని కోల్పోకుండా

మరింత శక్తిని పెంచుకొంటుంది. త్రైత సిద్ధాంతాన్ని వేరుగా, మూడు దైవ గ్రంథాలను వేరుగా చూడటం అంటే పరమాత్మను, ప్రకృతిని వేరు చెయ్యటంలాంటిది. పరమాత్మ లేకుండా ప్రకృతి ఉంది అంటే ఎంత అజ్ఞానమో, త్రైత సిద్ధాంతము తెలియకుండా దేవున్ని తెలియటం కూడా అంతే అజ్ఞానము.

భగవంతుడు రెండు యోగ సూత్రాలను సూత్రీకరించిన విధానములో మొదటి యోగ సూత్రము **"జ్ఞానయోగేన సాంఖ్యానాం"** అని ఉంది. శ్లోకములో ఇమిడి ఉన్న సూత్రాన్ని, శాస్త్రబద్ధంగా తెలియాలి అన్నా, తెలుపాలన్నా సూత్రములో ఉన్న కండీషన్ అర్థము కావాలి. సూత్రములో ఇమిడి ఉన్న నియమము సాంఖ్య వివరం తెలియాల్సి ఉంది. సాంఖ్యం అంటే శరీర నిర్మాణం. శరీర నిర్మాణం స్థూల, సూక్ష్మములుగా ఉంది. పై సూత్రములో ఉన్న నియమము స్థూల శరీరానికి కాదు అని స్పష్టంగా చెప్పవచ్చు. సూక్ష్మశరీరానికి సంబంధించిన సూక్ష్మజ్ఞానము, బ్రహ్మ విద్యా శాస్త్రము అయిన ఖురాన్ నియమము (3-7) ప్రకారము మనిషి చెప్పలేడు. పై సూత్రములో సూత్రీకరించబడిన జ్ఞానయోగము అంతఃకరణములలో ఒకటి అయిన 'మనసు' అనే ఇంద్రియముతో సంబంధ పడివున్నది. మనసు యొక్క పనితనాన్ని శాస్త్రబద్ధముగా తెలిసిన జీవుడు (మనిషి), 'బుద్ధి' అనే ఇంద్రియ సహాయంతో 'మనసు'ని నియంత్రిస్తే, జీవుడు పొందే అనుభవము జ్ఞానయోగము. అనుభవము నిరూపించబడితే శాస్త్రము అవుతుంది అన్నది సూత్రము. ఈ సూత్రము ప్రకారము పై విధానాన్ని సాంఖ్య వివరము, సూక్ష్మజ్ఞానం తెలిసిన మనిషే చెప్పాలి, బ్రహ్మవిద్యా శాస్త్రము అయిన ఖురాన్ నియమం (3-7) ని ఆధారము చేసుకొని మరియు "దేవుడు తన జ్ఞానాన్ని మూడవ విధానము అయిన

తన ప్రతినిధి ద్వారా తెలియజేయును” అన్న ఖురాన్ నియమమును (42-51) పరిగణలోనికి తీసుకుని మేము ప్రశ్నిస్తున్నాము, స్వామివారు ఎవరు? అంతరంగమున దైవత్వాన్ని అనుభవించిన అనుభవము నుండి ఉత్పన్నమైన ప్రశ్న స్వామివారు ఎవరు? అన్ని శాస్త్రములలో ఉన్న జ్ఞానాన్ని అనుసరించి, శాస్త్రాధారంతో ప్రశ్నిస్తున్నాము స్వామివారు ఎవరు? అని. ఒక ప్రశ్న వేస్తే శాస్త్రాధారము ఉండాలి అన్న జ్ఞానముతో ప్రశ్నిస్తున్నాము, స్వామివారు ఎవరు? త్రైత సిద్ధాంత ఆదికర్త శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు అని ప్రత్యక్షంగా తెలిసిన సత్యము. త్రైత సిద్ధాంతము మూడు దైవ గ్రంథముల ఆధారముతో తెలియబడినది అన్నది జగమెరిగిన సత్యము. బ్రహ్మవిద్యా శాస్త్రంగా పరిగణించబడుతున్న మూడు గ్రంథాలకు సంబంధించిన సమస్త ప్రజలందరూ ఏక కంఠముతో అడుగ వలసిన ప్రశ్న స్వామివారు ఎవరు? అని. మూడు దైవ గ్రంథములలో ఉన్న మొత్తము జ్ఞానము, సమస్త మానవుల అంతరంగమునకు సంబంధించినదే అయితే ఆ అంతరంగమునే మీకు సాక్షిగా ఉంచుతూ అడుగవలసిన ప్రశ్నే స్వామివారు ఎవరు? అని. ఆ అంతరంగమే మీకు ‘అనుభవము’తో కూడిన ‘నిరూపించబడిన’ ‘శాస్త్రబద్ధ’ సమాధానము చెబుతుంది స్వామివారు ఎవరు? అని.

త్రైతశకము ఆరంభమయింది. త్రైత సిద్ధాంతము ఆవిర్భవించింది. దేవుని మార్గము సుగమం అయింది. అవిశ్వాసవరులకు, ధర్మహీనులకు చరమగీతము పలికే సమయం ఆసన్నమయింది. అధర్మములను ధర్మమనీ, శాస్త్రము కాని వాటిని కూడా శాస్త్రము చెబుతుందనీ, బోధిస్తున్న గాలిగాళ్ళ గాలి మాటలు త్రైత సిద్ధాంత హోరులో కొట్టుకుపోయే తరుణం వచ్చింది. అశాస్త్రీయ దేవుని విధానానికి త్రైత సిద్ధాంతం అడ్డుకట్ట వేయనుంది. దేవుని

జ్ఞానము అడ్డము పెట్టుకుని అరాచకం సృష్టిస్తున్న అజ్ఞానుల ఆగడాలకు ఆనకట్టగా త్రైత సిద్ధాంతము నిలుస్తుంది. సకల జీవుల హక్కుగా ఉన్న పరలోక రాజ్యాన్ని, సమస్త మానవుల ఆస్తిగా ఉన్న దైవ గ్రంథాన్ని అడ్డము పెట్టుకుని పరలోక రాజ్యం మాదే అని, దేవుని జ్ఞానము మా దగ్గరే ఉంది అని అజ్ఞానాన్ని బోధిస్తున్న మేకవన్నె పులులను త్రైత సిద్ధాంత బోనులో బంధించే సమయము రానే వచ్చింది. దేవుడు ఒక్కడే అని చెప్పి, దేవుడు సృష్టించిన దేవతలను దేవున్ని చేసి, దేవుని విధానమే తెలియని దగాగాళ్ళకు త్రైత సిద్ధాంతము గుణపాఠం చెప్పనుంది. మా గడ్డాల పొడవు చూడండి, మా మీసాల మెరుపు చూడండి, మా తలలో పెరిగిన జడలు చూడండి అని బాహ్య వేషధారణలు ప్రదర్శిస్తున్న వేషగాళ్ళ వేషాలు, వాళ్ళ అజ్ఞానము బయటపడే సమయమొచ్చింది. త్రైత సిద్ధాంతము ద్వారా ప్రథమ దైవ గ్రంథము పురుషోత్తమ ప్రాప్తి యోగములో 16, 17 శ్లోకములలో ప్రస్తావించబడిన మూడు ఆత్మల వివరము ప్రకాశవంతమైన రోజులు ఆరంభము అయ్యాయి. మత్తయి సువార్త 28వ అధ్యాయము 18, 19, 20 వాక్యములలో సూచించబడ్డ మూడు ఆత్మల ఉనికి త్రైత సిద్ధాంతము ద్వారా బట్టబయలు కానున్నది. పవిత్ర ఖురాన్‌లో 50వ సూరా 21వ ఆయత్‌లో దాగివున్న మూడు ఆత్మలను త్రైత సిద్ధాంతము బయటకు తీసింది. ఇప్పటికే ఇస్లామ్ ప్రజలను 'అల్లా' ఆనంద సాగర డోలికలలో ముంచెత్తుతోంది. సమస్త ప్రజలు దేవుని దరికి చేరే మార్గాలు సుగమమయ్యాయి. పరలోక రాజ్యానికి బాటలు వేసే కార్యక్రమం యుద్ధప్రాతిపదికన త్రైత సిద్ధాంతము ద్వారా జరుగుతుంది. 'మోక్షము' అనే పదానికి అర్థమే తెలియని ప్రజలకు దాని భావము తెలిసే అవకాశమే లేదు. అలాంటి ప్రజలకు కూడా కొన్ని లక్షల సంవత్సరముల వరకు బీటలువారని మోక్షమార్గము త్రైత సిద్ధాంతము ద్వారా వేయబడుతుంది.

భగవంతుడు తన రెండవ మార్గాన్ని కూడా కర్మయోగము 3వ శ్లోకములోనే సూత్రీకరించాడు. సూత్రములో భావాన్ని చెప్పుకుంటే **'కార్య వివరము తెలిసిన వాడు కర్మయోగి'** గా ఉంటాడు అన్నది సూత్ర భావము. దేవున్ని చేరుకునే ఈ మార్గము (యోగము) చాలా విశేషముతో కూడుకొని ఉన్నది అని చెప్పవచ్చు. ఎందుకంటే దేవుడు తన జ్ఞానాన్ని చెప్పి, ధర్మ సంస్థాపనమొనర్చుటకు తన మూడవ విధానమయిన భగవంతుడి రాక కర్మయోగ పద్ధతిలోనే వస్తున్నట్లు అర్థము అవుతుంది. కాబట్టి కర్మయోగాన్ని శాస్త్రబద్ధముగా అర్థము చేసుకోవలసిన అవసరము ఉంది. భగవంతుడిని అశాస్త్రీయముగా ఊహించుకోవటం వలన గతంలో వచ్చిన రెండు రాకడలను గుర్తించడములో మనిషి పూర్తిగా నష్టపోయాడు. మూడవ రాకడను కూడా ద్వితీయ దైవగ్రంథములో సూచించటము జరిగింది. "ఇప్పుడు నేను చెప్పిన కొన్ని యదార్థాలను మీరు సహించలేరు. ఆదరణ కర్త వచ్చి మిమ్ములను సర్వసత్యములోనికి నడిపిస్తాడు" అని మూడవ రాకడ సూచనను మనిషి ప్రతి జన్మలో కూడా పరిగణలోకి తీసుకోవలసిన అవసరము ఉంది. ఎందుకంటే "పెండ్లికుమారుడు వచ్చు సమయమునకు దివిటీలు పట్టి, కాచుకొని ఉండండి" అని అదే ద్వితీయ దైవగ్రంథములో హెచ్చరించటము కూడా జరిగింది. మూడవ రాకడను అయినా గుర్తించటానికి అవసరమైన దివిటీలను (జ్ఞానాన్ని) శాస్త్రబద్దముగా తెలుసు కొందాము.

రెండవ సూత్రములో ఇమిడి ఉన్న భావము "కార్య వివరము తెలిసిన వాడు కర్మయోగి" అని ఉంది. సూత్రములో మొదటి భాగమైన దత్తాంశాన్ని తీసుకుంటే "దత్తాంశము" లో ఉన్న రాశులు కార్యము మరియు కర్మ. సూత్రములో ఉన్న రాశులను అర్థము చేసుకోవడములో మనిషి

పూర్తిగా తడబడిపోయాడు. భగవంతుడు తన భావాన్ని భాష ద్వారా తెలియజేస్తే భాషలో ఉన్న భావాన్ని మనిషి గ్రహించలేకపోయాడు మనిషి భావాన్ని విడిచి భాషకు ప్రాధాన్యతనిచ్చాడు. **భాషలో పాండిత్యాన్ని విడిచి, భావములో పాండిత్యాన్ని జూచువాడు నిజమైన జ్ఞాని** అన్న సూత్రాన్ని విస్మరించాడు. సూత్రములో ఉన్న రాశులు 'కార్యము', 'కర్మ' లకు ఉన్న పరస్పర సంబంధాన్ని శరీర నిర్మాణం ప్రకారము అందుకోలేకపోయాడు. యోగము అన్న పని అంతరేంద్రియముల సహకారంతో జరిగే ప్రక్రియ అన్న శాస్త్రీయతను తెలియకపోవుట వలన జరిగిన పొరపాటు. సూత్రములో బాహ్యంగా కార్యము, కర్మరాశుల భావము అర్థము కావటానికి అవకాశము ఉన్నా, వాస్తవముగా సూత్రము, అంతరేంద్రియములతో సంబంధపడి ఉంది. అంతరేంద్రియముల విధి విధానము, వాటి స్థావరము కానలేని మనిషి సూత్రాన్ని సిద్ధీకరించటంలో తప్పటడుగు వేసేశాడు. సూక్ష్మశరీరానికి సంబంధించిన సూక్ష్మజ్ఞానము మనిషి చెప్పలేడు అను ఖురాన్ నియమము (3-7) ని విస్మరించాడు. ఇప్పుడు అసలు విషయానికి వద్దాము. సిద్ధాంతములో దత్తాంశముగా ఉన్న రెండు రాశుల కార్యము, కర్మ గురించి ఒక క్రమ పద్ధతిలో తెలుసుకుందాము. మొదటి రాశి కార్యము, శరీరములో ఒక ఇంద్రియము కాదు. అది ఒక ఉత్పన్న రాశిగా చెప్పుకోవచ్చు. భౌతిక, రసాయన, గణిత శాస్త్రములలో మనకు ప్రధాన రాశులు (Fundamental Units) మరియు ఉత్పన్న రాశుల (Derived Units) తో మనకు అనుభవమే. కార్యముకు అర్థము చెప్పుకుంటే, శరీరం ద్వారా జరిగే ఒక పనిని కార్యముగా చెప్పవచ్చు. రెండవ రాశి 'కర్మ'. ఇది కూడా శరీరములో ఏ ఇంద్రియ వ్యవస్థకు సంబంధము లేనిది. ఒక జీవికి జన్మ జరిగి మరణము పొందువరకు జీవిత కాలములో అనుభవించు కష్ట సుఖముల కారణ సముదాయాన్ని కర్మరాశిగా చెప్పవచ్చు. ఇప్పుడు రెండు రాశుల అర్థాన్ని

సక్రమముగా గ్రహిస్తే, సూత్రములో కార్యమునకు, కర్మకు ఉన్న సంబంధాన్ని భగవంతుడు సూత్రముగా చెప్పిన సారాంశాన్ని తెలియవచ్చు.

**సారాంశము :-** శరీరము ద్వారా జరుగు కార్యములకు తలలో కర్మచక్రములో ఉన్న కర్మ రాశియే కారణము అని నిరూపించుట.

**ఉపపత్తి లేదా నిరూపణ :-** దత్తాంశములో ఇవ్వబడ్డ కార్యములు, కర్మ రెండు రాశులు శరీరములో ప్రధాన రాశులు అయిన 25 ఇంద్రియములలో ఏ ఇంద్రియమునకు సంబంధము లేనివి. రెండు రాశులు కూడా ఉత్పన్న రాశులే. ఉత్పన్న రాశులు అంటున్నాము కాబట్టి ఉత్పన్నం శరీరము ద్వారానే అవుతున్నాయి. కాబట్టి, ఉత్పన్నం ఎలా అవుతున్నది, అనుభవ పూర్వకముగా చెప్పవచ్చు. కార్యము అంటే శరీరము ద్వారా జరుగు పని అని చెప్పుకున్నాము. శరీరము ద్వారా ఒక పని జరగాలి అంటే, తలలో ఉన్న ఆ పనికి సంబంధించిన గుణము ప్రేరణకు రావాలి. ఒక పని జరిగింది అంటే, దానికి సంబంధించిన గుణము పని చేసింది అని చెప్పవచ్చును. స్థూలంగా కనబడుతున్న కార్యానికి, సూక్ష్మంగా కనబడని గుణము సహకరించిందని అనుభవపూర్వకంగా చెప్పవచ్చు. అంటే కార్యము రూపం దాల్చకముందే గుణం పని చేసింది. కార్యముతో గుణము సంబంధపడి ఉందని నిర్ధారించవచ్చు. అంటే ఒక శరీరము ద్వారా ఒక కార్యము జరుగుతుందంటే దానికి ప్రత్యక్ష కారణం గుణం అని అనుభవపూర్వకంగా చెప్పవచ్చు. కానీ సారాంశంలో ఇవ్వబడ్డది, కార్యానికి కర్మ కారణం అని ఉంది. నిరూపించవలసిన విషయము కూడా అదే. కర్మను మరి కొంచెము లోతుగా అర్థము చేసుకోవలసిన అవసరము ఏర్పడింది. కర్మను కూడా ఉత్పన్న రాశియే అని చెప్పుకున్నాము. కానీ అది ఎప్పుడు ఉత్పన్నము అయ్యింది? ఎలా ఉత్పన్నము అయింది? అన్నది ప్రశ్న. ఈ విషయాన్ని

శాస్త్రాధారంతో తెలియాలి తప్ప, నేరుగా అనుభవంతో చెప్పలేము. దానికి కారణము కూడా హేతుబద్ధంగానే చెప్పుకుందాము. జీవుడు శరీరములోకి ప్రవేశించక ముందే ఆత్మ ద్వారా సంచితము నుండి, ప్రారబ్దముగా జరిగే ప్రక్రియ. శరీర వ్యవస్థతో సంబంధములేని సమయములో జరుగును. ఇక్కడ ఒక ప్రశ్న అడగడానికి ఆస్కారము ఉంది. సంచితము నుండి ప్రారబ్దము వేరు చేసినప్పుడు జీవునికి శరీరముతో సంబంధము లేకపోయిన, శరీరముతో ఉండగా సంచిత కర్మ ఉంది కదా! అని ప్రశ్నించవచ్చు. అది జీవుడు అజ్ఞాన దశలో ఉన్నప్పుడు అని గ్రహించాలి. అజ్ఞాన దశలో ఉత్పన్నమైన కర్మను, జ్ఞానదశలో ఎట్లా నిర్మూలించుకోవాలి అన్నదే సూత్రము యొక్క ముఖ్య ఉద్దేశ్యము. అజ్ఞాన దశలో జీవునికి కర్మ ఎట్లా ఏర్పడుతుంది? జ్ఞాన దశలో జీవుని కర్మ ఎట్లా నిర్మూలించబడుతుంది? శరీర నిర్మాణం ప్రకారము తెలియ ప్రయత్నిద్దాము.

ఈ ప్రయత్నంలోనే నేరుగా తెలియలేని మరి రెండు ప్రధాన రాశులు అయిన అంతరేంద్రియముల ఉనికి, పనితనము అనుభవానికి, నిరూపణకు వచ్చు అవకాశము ఉంది. కొంచెము శ్రద్ధ వహించండి. శరీరము ద్వారా జరుగు కార్యములన్నియు గుణము యొక్క కారణమున 'నేనే చేస్తున్నాను' అని అజ్ఞాన దశలో ఉన్న జీవుడు భావిస్తున్నాడు. వాస్తవముగా శరీర నిర్మాణం దానికి భిన్నముగా ఉంది. ఈ విషయాన్ని సమర్థిస్తూ భగవంతుడు సూచించిన సూచనను ఇక్కడ సందర్భోచితంగా ప్రస్తావించుకొందాము. భగవద్గీత కర్మయోగములో 27వ శ్లోకములో..

*శ్లో॥ 27. ప్రకృతేః క్రియ మాణాని గుణైః కర్మాణి సర్వశః ।*
*అహంకార విమూఢాత్మా కర్తా హమితి మన్యతే ॥*

**భావము :-** ప్రకృతి నిర్మాణం (శరీర నిర్మాణం) ప్రకారము కర్మ వలన కలుగు గుణప్రేరణ ద్వారా జరుగు అన్ని పనులకు కర్తను నేనే అని అహంకారముగ గల జీవుడు అజ్ఞానిగా తలచుచుండును.

పై సూచనలో రెండు ప్రధానమైన అంశాలు బయటపడ్డాయి.

1) కర్మ వలన కలుగు గుణప్రేరణలు

2) అహంకారము గల జీవుడు.

ఈ రెండు విషయాలను శరీర నిర్మాణం ప్రకారము అందుకోలేని భగవద్గీత రచయితలు కర్మయోగ సూత్రానికి ఆచరణ యోగ్యతను కల్పించలేక పోయారు. భగవంతుని భావాన్ని అందుకోలేని భగవద్గీత రచయితలు, భాషలోని అర్థాన్ని పట్టుకొని వక్ర భాష్యం చెప్పారు. కర్మకు కార్యముగా అర్థము చెప్తుతూ, అహంకారాన్ని ఒక గుణంగా అభివర్ణిస్తూ, వాళ్ళు శాస్త్రీయతను కోల్పోతూ, మనుషులను శాస్త్రబద్దతకు దూరము చేశారు. పరోక్షముగా చెప్పుకొంటే, భగవంతుడు దేవున్ని చేరుకోవడానికి వేసిన జ్ఞాన మార్గాన్ని వాళ్ళ అజ్ఞానముతో పూర్తిగా మూసేశారు. కర్మకు, గుణములకు కార్యమునకు ఉన్న పరస్పర సంబంధాన్ని శరీర నిర్మాణం ప్రకారము అందుకోలేకపోయారు. ప్రతిక్షణం శరీరము ద్వారా జరుగు ప్రతి కార్యములో దైవత్వాన్ని అనుభవించటానికి ఆస్కారం ఉన్న కర్మయోగ మార్గాన్ని అపహాస్యం చేశారు. సరే! ఆ విషయాలను కొంతసేపు ప్రక్కన పెడదాము.

శరీరము ద్వారా జరుగు కార్యములను, కార్యములు జరుగుటకు అవసరమైన గుణములను తెలియటం వరకు మనిషికి ఎటువంటి ఇబ్బంది లేదు. సూత్రములో ఇమిడివున్న కార్యము, గుణములు, కర్మ మూడు రాశులు కూడా ప్రధాన రాశులు అయిన 25 ఇంద్రియములలో లేనివి. ఏ కార్యము అనుభవానికి వచ్చినా శరీరముతో ప్రధాన రాశులు అయిన 25

ఇంద్రియములతోనే నిర్ధారించాలి. యోగము అన్న ప్రక్రియ పూర్తిగా అంతరేంద్రియ వ్యవస్థకు సంబంధించినది. ఒక కార్యము శరీరము ద్వారా రూపు దాల్చింది అంటే, ఆ కార్య సంబంధ ఇంద్రియ పనితనాన్ని అనుభవించి, అవగతము చేసుకొని, శరీర నిర్మాణం ప్రకారము నిర్ధారించాలి. కాబట్టి శరీరములో వాటి నిర్మాణాన్ని ఒకసారి క్రింద చూపబడిన పటము ద్వారా పునఃపరిశీలిద్దాము.




(పటము-1)

గుణ చక్రము




(పటము-2)

ముందుగల పటములో చూపబడిన నిర్మాణాన్ని పటము (1) ద్వారా పరిశీలిస్తే జీవుడు, బుద్ధి, చిత్తము, అహము అంతరేంద్రియములకు ఉన్న పరస్పర సంబంధాన్ని తెలియవచ్చు. నిర్మాణం ప్రకారము జీవుడు మూడు అంతరేంద్రియముల సమూహంగానే ఉన్నాడు. నిర్మాణం ప్రకారము అంతరేంద్రియముల పనితనము జీవునికి తెలియడానికి వీలుగానే దేవుడు అమర్చి పెట్టాడు. కానీ పటము (2) నిర్మాణాన్ని పరిశీలిస్తే, జీవునితో సహా ఉన్న అంతరేంద్రియ సమూహాన్ని గుణచక్రములో అమర్చాడు. పటము (2) నిర్మాణాన్ని పరిశీలిస్తే కర్మచక్రానికి, గుణచక్రానికి ఎటువంటి సంబంధము ప్రత్యక్షముగా కనిపించటం లేదు. నిర్మాణం ప్రకారము రెండు చక్రాలను అనుసంధానించేది ఆత్మ భాగముగానే తెలుస్తుంది.

నిర్మాణాన్ని మరింత లోతుగా పరిశీలిస్తే, అనుసంధానంగా ఉన్న ఆత్మను ఆధారముగా చేసుకొని, అనుభవానికి రాని కర్మను అర్థము చేసుకోవటానికి ఆస్కారము ఉంది. అనుభవానికి రాని కర్మను అర్థము చేసుకునే ముందు, ఆధారము చేసుకోవలసిన ఆత్మ అనుభవానికి రావాలి కదా? అని మీరు ప్రశ్నించడానికి అవకాశముంది. దానికి మా సమాధానము ఇలా ఉంది. కర్మరాశి (చక్రము) సహాయం లేకుండానే మనసు, బుద్ధి ప్రధాన రాశులయిన ఇంద్రియముల సహాయముతో జ్ఞానయోగ మార్గము ద్వారా ఆత్మను అనుభవించి రూఢి పరచుకున్నాము అని ఇక్కడ అర్థము చేసుకోవాలి. అదే ఆత్మ అనుభవముతో చెప్పుచున్నాము. దత్తాంశములో ఇవ్వబడ్డ రెండు రాశులు 'కార్యము', 'కర్మ'. తద్వారా ప్రకటితమయిన గుణములు మూడు ఉత్పన్న రాశులు. శరీరములో ప్రధాన రాశులుగా ఉన్న 25 ఇంద్రియముల వ్యవస్థలో దేనికీ సంబంధము లేనిది ఆత్మ. ఒక విషయము సత్యము అని చెప్పుటకు ఆ విషయము ఏదైనా ప్రధాన

ఇంద్రియముతో సంబంధపడి ఉండాలి. అప్పుడే అది అనుభవానికి వస్తుంది. అనుభవానికి వచ్చిన విషయం సత్యము అవుతుంది. అనుభవముతో చెప్పిన సత్యము నిరూపించినట్లు అవుతుంది. ఇంతవరకు లభించిన ఆధారముతో మరి కొంచెము లోతుగా లోచన చేద్దాము.

## కర్మ - గుణము - కార్యము

పై మూడు రాశుల సంబంధము ద్వారా ఉత్పన్నమైన కార్యము రూపు దాల్చక ముందే జీవునికి వేరొక అనుభవము చోటు చేసుకుంటుంది. కార్యము రూపు దాల్చక ముందు చెయవలసిన పని మంచిదా, చెడ్డదా అన్న ఆలోచన, లోచనలు జీవుని అనుభవానికి తగులుతున్నాయి. ఆలోచన, లోచనలు మంచి, చెడుల పనితనము బుద్ధి అనే ఇంద్రియము యొక్క పని అని శాస్త్రాధారముతో జీవుడు (మనిషి) ఎరిగిన విషయమే. ఈ అనుభవముతో కర్మ ద్వారా గుణము ప్రేరణకు వచ్చి కార్యముగా రూపు దాల్చుటకు బుద్ధి అనే ఇంద్రియము సాక్షిగా ఉన్నట్లు రూఢి అయినట్లయింది. మరి కొంచెము శ్రద్ధను వినియోగించి, కార్యములో భాగస్వామిగా ఉన్న మరొక ఇంద్రియాన్ని కూడా తెలుసుకొందాము. జీవుడు కష్ట బాధలకు చెడు గుణ సంబంధ కార్యములే కారణము అని బుద్ధి విచక్షణ చేసినప్పటికీ కార్యము రూపు దాల్చుతుందంటే, కార్యరూపం జరగటానికి వేరొక ఇంద్రియ శక్తి నిర్ణయాత్మక పాత్ర వహిస్తుంది అని పరోక్షముగానైనా ఒప్పుకోవలసిందే. జన్మ జరిగి జ్ఞానదశకు చేరిన ఉత్తర క్షణము వరకు జరిగిన జీవిత కార్యములను ఒకసారి మననము చేసుకుంటే ప్రతి కార్యము కర్మ ప్రకారము రూపుదాల్చుటకు చిత్తము అను ఇంద్రియము నిర్ణయిస్తుందని రూఢి అవుతుంది. ఒక కార్యము స్థూల శరీరము ద్వారా రూపు దాల్చక ముందే జీవుడు కర్మ కారణమున గుణముల ప్రేరణ చెందుతున్నాయి. కర్మ ఆత్మ

సహకారంతో గుణచక్రములోకి దిగి గుణములను కదిలిస్తుంది. కదిలిన గుణములలోనే సమూహంగా ఉన్నాయి అంతరేంద్రియములు. గుణము కదలగానే అంతరేంద్రియములు వాటి పని అవి చేస్తున్నాయి. తద్వారా కార్యము రూపు దాల్చుతోంది. శరీరము ద్వారా ఒక కార్యము ఉత్పన్నము కావటానికి వాస్తవ విధానము ఇలా ఉంటే, అజ్ఞాన దశలో అహంకారము అనే ప్రధాన ఇంద్రియముతో సంబంధపడి ఉన్న జీవుడు కర్మను పొందుతున్నాడు. జ్ఞానదశలో అహము అనే ప్రధాన ఇంద్రియము యొక్క పనితనాన్ని ఎరిగిన జీవుడు (మనిషి) ఆహముతో లగ్నమై కార్యము ద్వారా వచ్చు కర్మను రాకుండా నిర్మూలించుకుంటున్నాడు. అహము యొక్క పనితన గ్రంథముల ద్వారా అనుభవానికి రాని జ్ఞానులు స్వామివారి **'అహము'** అనే ప్రసంగము ద్వారా విని అనుభూతి పొందవలెనని మనవి చేసుకొంటున్నాము. ఎందుకంటే కర్మయోగ మార్గము 'అహము' తోనే సంబంధపడి ఉంది. స్వామివారి జ్ఞాన ప్రసంగములో అహము అద్దంలో ప్రతిబింబంవలే ప్రతిబింబించింది.

భగవంతుడు దేవున్ని చేరుటకు వేసిన రెండు యోగ మార్గాలు శరీర అంతర్గతముగా ఉన్నవి. రెండు యోగ విధానాలు అంతరేంద్రియ వ్యవస్థతో సంబంధపడి ఉన్నవి. మూడవ విధానము వీటికి భిన్నమైన మార్గము 25 ప్రధాన (రాశులు) ఇంద్రియముల సమాహారంగా ఉన్న మొత్తము శరీరముతో చేయవలసిన యోగము. ఈ విధానము చాలా విశేషముతో కూడుకున్నదని చెప్పవచ్చు. రెండు యోగ విధానాలు శాస్త్రబద్ధముగా అవగతము అయితే గానీ మూడవ విధానము శాస్త్రబద్ధత అనుభవానికి రాదు. ఈ విధానము బాహ్యంగా స్థూల కార్యములతో సంబంధపడినప్పటికీ అంతరంగముగా ఉన్న కర్మపై విశేషమైన ప్రభావాన్ని

చూపే విధానమై ఉన్నది. మొదటి రెండు యోగ విధానాలు ఒకటి సంచిత కర్మపై ప్రభావము చూపితే, రెండవది ఆగామి కర్మపై ప్రభావము చూపుతుంది. మూడవ యోగ విధానము రెండు కర్మలపై ప్రభావము చూపడమే కాక క్షమించరాని పుణ్యము లేదా సంస్కార బలమును సంతరింపజేస్తుంది అని త్రైత సిద్ధాంతము శాస్త్రబద్ధమైన అనుభవాన్ని ఇచ్చింది. ఎన్నో ప్రయోజనాలతో, ఎంతో ప్రాధాన్యతతో కూడి వున్న మూడవ విధానమే భక్తియోగము. త్రైత సిద్ధాంత ఆధారముతో భక్తియోగ మార్గాన్ని మరి కొంచెము వివరముగా తెలుసు కుందాము.

భగవంతుడు ప్రథమ దైవగ్రంథము భగవద్గీత భక్తియోగము 10వ శ్లోకంలో చేసిన సూచనను ఒకసారి మననము చేసుకుందాము.

*శ్లో॥ 10.* *అభ్యాసేప్య సమర్థోసిమత్కర్మ పరమోభవ ।*
*మదర్థ మపి కర్మాణికుర్వన్ సిద్ధిమవాప్స్యసి ॥*

**భావము :-** యోగమార్గాలు అర్థమై వాటిని అనుసరించటానికి శరీర నిర్మాణం సహకరించని యెడల నా పనులు చేయండి నన్ను పొందగలరు.

ధర్మము అధర్మముగా మారిన కాలము నుండి నేటి వరకు భూమిమీద మూడవ మార్గము యొక్క శాస్త్రబద్ధత తెలియలేరని ఖచ్చితంగా చెప్పవచ్చు. రెండు మార్గముల శాస్త్రబద్ధత అర్థము కానిదే మూడవ మార్గము అర్థము కావటానికి అవకాశమే లేదు. మొదటి రెండు మార్గములు సూక్ష్మ శరీరముతో సంబంధపడిన విధానము, సూక్ష్మ శరీర జ్ఞానాన్ని మనిషి చెప్పలేడు అన్న ఖురాన్ (3-7) మరియు (42-51) నియమాలు, ఈ విషయాన్ని శాస్త్రబద్ధంగా ధృవీకరిస్తున్నాయి. దీనినిబట్టి మూడవ మార్గము మనిషి తెలియలేడని శాస్త్రబద్ధంగా ధృవీకరించినట్లు అయినది.

భగవంతుడు చెప్పిన మూడవ యోగ సూత్రములో ఉన్న కండీషన్ అర్థము చేసుకోవడానికి ప్రయత్నిద్దాము. "మదర్థ మపికర్మాణి కుర్వన్" నా కొరకు నా పనులు చేయ్యండి అన్నది సారాంశము. "అభ్యాసేప్య సమర్థోసి మత్కర్మ పరమోభవ" నేను చెప్పిన మార్గాలను అభ్యసించటానికి అసమర్థుడవైన వేళ నా పనులు చెయ్యి అన్నది సూత్రము యొక్క కండీషన్. సూత్రములో ఇమిడి ఉన్న కండీషన్ పరిశీలిస్తే, ముందు ఆయన పని ఏమిటి? అని తెలియవలసిన అవసరము ఉంది. తద్వారా ఆయనెవరో గుర్తించటానికి అవకాశము దొరికినట్లు అవుతుంది. ఏ దారి లేనప్పుడు ఉన్న దారిలో పయనించడం వివేకవంతుని విధానము. ఈ ప్రయత్నంలో ఆయన పనిని తెలిసి, ఆయనను గుర్తించగలిగితే భగవంతుడు మనిషికి ఒక జాక్‌పాట్ అవకాశాన్ని ఇచ్చాడు. ఈ విషయాన్ని ఆయన మాటలలోనే తెలుసుకుందాము. భగవద్గీత జ్ఞానయోగము 9వ శ్లోకములో...

***శ్లో॥ 9. జన్మకర్మచమేదివ్య మేవం యోవేత్తి తత్త్వతః।***
***త్యక్త్వా దేహం పునర్జన్మ నైతిమామేతి సోర్జున॥***

**భావము :–** "నా దివ్యమైన పనులను, జన్మను తెలుసుకున్నవాడు మరణించిన తర్వాత వేరు జన్మమునకు పోక నాలోకి ఐక్యమగును." ఒక క్లూ ఇవ్వబడిందంటే దాని ద్వారా ప్రయత్నం చేసుకోమనే కదా! దాని ఉద్దేశ్యం. కానీ దానికి ఎన్నో జన్మల సంస్కారబలం అవసరము అని ఇటీవలి కాలము లోనే ఋజువైంది. మనువు (భీష్ముని) జన్మ వృత్తాంతము తెలిసిన తర్వాత అది ఎంత దుర్లభమైన పనియో అర్థము అయింది. ప్రస్తుతం సాధ్యం కాకపోయినా భవిష్యత్తు జన్మలకైనా ఆ సంస్కార బలాన్ని పొందటానికి ప్రయత్నిద్దాము. ఇప్పుడు అసలు విషయానికి వద్దాము. సూత్రములో ఉన్న కండీషన్ ద్వారా ఆయన పనిని తెలిస్తే ఆయనను గుర్తించవచ్చు అని

అర్థము అవుతుంది. ఆయన ఎందుకు వస్తాడు? ఎప్పుడు వస్తాడు? అన్న శాస్త్రాధారము దొరికితే ఆయన పనిని, ఆయనను గుర్తించడానికి అవకాశము దొరికినట్లవుతుంది. ఈ విచక్షణ ద్వారా శాస్త్రాన్ని ఆధారము చేసుకుంటే భగవద్గీత జ్ఞానయోగము 7, 8 శ్లోకములు ఆయన రాకడను నిర్ధారిస్తున్నాయి. ఈ నిర్ధారణ ద్వారా ఆయన పనిని శాస్త్రబద్ధంగా ధృవీకరించినట్లయింది. ఆ శ్లోక భావాన్ని క్రింద పరిశీలిద్దాము.

***శ్లో॥ 7.*** ***యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత! ।***
***అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥***

**భావము :-** ఎపుడెపుడు ధర్మములకు గ్లాని ఏర్పడి అధర్మము వృద్ధి చెందుచున్నదో, అపుడు నన్ను నేను తయారు చేసుకొని భూమిమీద పుట్టుచున్నాను.

***శ్లో॥ 8.*** ***పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చదుష్కృతామ్ ।***
***ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే ॥***

**భావము :-** ధర్మాచరణ కల్గిన వారిని సంరక్షించుటకు, అధర్మ ఆచరణ కల్గిన వారిని లేకుండా చేయుటకు, ధర్మసంస్థాపన మొనర్చుటకు యుగ యుగమందు పుట్టుచుందును.

పైన ఇవ్వబడిన శాస్త్రాధారముతో ఒక సత్యం నిర్ధారణకు వస్తుంది. అనంతమై, అఖండమై, అవిభక్తమై, సృష్ఠికే ఆధారమైన, నిరాకారమైన పరమాత్మ తన ధర్మానికి హాని ఏర్పడినప్పుడు, అధర్మములు వృద్ధి నొందినప్పుడు తనను తాను మనిషిగా తయారు చేసుకొని సాకారుడనై వస్తాను అని ప్రథమ దైవగ్రంథములోని పై రెండు ప్రస్తావనలు శాస్త్రాధారమై ఉన్నవి. నిరాకారము, సాకారమై వచ్చాడు అంటే ధర్మము అధర్మముగా

వృద్ధినొందినది అని పరోక్షముగా నిర్ధారించబడుచున్నది. రూప, నామ, క్రియారహితుడు అని ప్రధాన ధర్మాన్ని కలిగియున్న దేవుడు రూప, నామ, క్రియలతో భగవంతుడిగా వచ్చాడంటే ఆయన ఏ ఉద్దేశ్యముతో వచ్చాడో అదే ఆయన పనిగా పరిగణించవలసి వస్తుంది. ఈ వివరము ద్వారా ఆయన ఫలానా పని మీద వచ్చినట్లు నిర్ధారించబడినట్లు అయింది. ఒక యజమానికి ఒక పని ఉందంటే ఆ పని నిర్వహణకు కొంతమంది సిబ్బందిని నియమించి ఆ పని చేయించవచ్చు. పని చేసిన సిబ్బందికి యజమాని కూలి లేదా జీతముగా కొంత ఫలితాన్ని ఇవ్వడం జరుగుతుంది. ప్రపంచ, పరమాత్మ రెండు విధాలుగా ధర్మ (చట్ట) బద్దమే కానీ ఇక్కడ పని చేసిన సిబ్బంది రెండు భావాలతో చేయడం జరుగుతుంది. కొంతమంది సిబ్బంది వృత్తే దైవంగా భావించి చేస్తే, మరి కొంతమంది సిబ్బంది జీతమే ప్రాధాన్యంగా చేస్తారు. ఒక రకము సిబ్బందికి కర్మ నిర్మూలన అనునది ఫలితముగా ఇవ్వబడితే మరొక రకం సిబ్బందికి క్షమించరాని పుణ్యం ఫలితంగా ఇవ్వబడుతుంది. ఈ విషయమై యోగీశ్వరులవారు **"స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!"** అనే త్రైత సిద్ధాంత దైవగ్రంథములో శాస్త్రబద్ధమైన వివరణను అందించారు.

పై వివరము ఆధారముగా పరమాత్మ భగవంతుడుగా వస్తే, ధర్మపునఃస్థాపన పని చేస్తాడు అని చెప్పవచ్చును. ధర్మ పునఃస్థాపన పని చేయడానికి వచ్చాడంటే అప్పటికి ఉన్నది అధర్మము అని విచక్షణతో చెప్పవచ్చు. ధర్మము ఇది అని చెప్పినప్పుడు అధర్మాన్ని కూడా ప్రస్తావించే ఉండాలి. ధర్మాధర్మములు రెండిటినీ ప్రస్తావించినప్పటికీ అధర్మాచరణనే కలిగియున్నాము అంటే ధర్మము ఇది అని నిర్దిష్టముగా అర్థము కాలేదని చెప్పవచ్చు. దైవగ్రంథములో ధర్మాధర్మములు రెండూ ప్రస్థావించినప్పటికీ

అధర్మ మార్గము ఇది అని, ధర్మమార్గము అది అని ఎందుకు మనిషి నిర్ధారించుకోలేకపోయాడు? ఈ రహస్యాన్ని త్రైత సిద్ధాంతము ద్వారా ఛేదించండి. త్రైత సిద్ధాంతము ఎటువంటి ఆధ్యాత్మిక సంశయానికైనా ఎదురాడని జవాబు ఇస్తుంది.

జ్ఞానము ధర్మాన్ని తెలియజేస్తే, ధర్మము దేవుని మార్గాన్ని సూచిస్తుంది. సూచించిన మార్గము ఒకసారి తెలియకపోతే రెండవసారి తెలియవచ్చు. రెండవసారి తెలియకపోతే మూడవసారి తెలియవచ్చు. అది దేవుని పని. ఈ విషయము **"మూడు గ్రంథములు-ఇద్దరు గురువులు-ఒక బోధకుడు"** అనే త్రైత సిద్ధాంత గ్రంథము ద్వారా రూఢి పరచుకోవచ్చు. కానీ అధర్మాన్ని స్పష్టముగా ప్రస్తావించినప్పటికీ అధర్మాన్ని గుర్తించలేదు అంటే ఇది మానవ తప్పిదం. దేవుని ధర్మాన్ని తెలిసి ధర్మాచరణలో ఉండేవారిని దేవుని భక్తులుగా చెప్పవచ్చు. నా మార్గాలకి ఈ విధానాలు సరికావు. ఈ విధానాలను అతిక్రమిస్తే నన్ను పొందలేవు, నన్ను చేరలేవు అని దైవగ్రంథములో స్పష్టపరిస్తే ఆ విధానాలనే అనుసరించవలసిన అవసరము ఏమొచ్చింది? ఏ విధానాలు అయితే దేవుని దరికి చేర్చలేవో అవి దేవునికి అధర్మాలు కావా? అని మేము ప్రశ్నిస్తున్నాము. సిగరెట్ త్రాగడం ఆరోగ్యానికి హానికరము అంటే, సిగరెట్ త్రాగకపోవటం ఆరోగ్యకరం అని వేరేగా చెప్పాలా? ప్రపంచ విషయములో ఎంతో విజ్ఞతను, ప్రజ్ఞను ప్రదర్శిస్తున్న మనిషికి దేవుని విషయంలో ఎందుకు ఈ రాజీతనము. ఆరోగ్యముగా ఉండటానికి పరిమితము అయిన నియమాలు పాటిస్తే చాలు. కానీ అనారోగ్యం పాలు కావడానికి అశేషమైన దారులు. దేవున్ని చేరటానికి సృష్టి ఆదినుండి చెప్పబడిన మార్గాలు మూడు. ఈ మూడు మార్గాలు కాని మార్గమేదైనా అధర్మమార్గమే. దేవుని భక్తులము, దేవునికి ఇష్టులము అని

మీరు చెప్పుకొంటే సరిపోతుందా? శాస్త్రము అని నామమాత్రముగా చెప్పి, శాస్త్ర నియమాలను అనుసరించకపోతే తత్ ఫలితాలను పొందగలమా? భగవంతుడు అక్షర పరబ్రహ్మయోగము 28వ శ్లోకములో చేసిన సూచనలను అతిక్రమిస్తే నన్ను చేరలేవు అని చెప్పిన జ్ఞానాన్ని అతిక్రమించి అదే విధానాలు అనుసరించ వలసిన అగత్యం ఏమొచ్చింది? రాజవిద్యా రాజగుహ్య యోగము 25వ శ్లోకములో దేవుడు వేరు, దేవతలు వేరు అని చెప్పిన విషయం అర్థము కాలేదా? దేవుని సృష్ఠి అయిన జగతిలో దేవతలు కూడా ఒక భాగమే అన్న జ్ఞానము మీకు లేదా? అర్థము అయితే దేవున్ని చేరే మార్గాలను తప్పించి దేవతలను చేరే దేవతారాధనలను ఎందుకు చేస్తున్నారు? ఎందుకు చేయిస్తున్నారు? "వేదేషు, యజ్ఞేషు, తపస్సుచైవ, దానేషు" అన్న నాలుగు విధానాలను అతిక్రమించండి అని భగవంతుడు సూచిస్తే వేదమంత్రములతో యజ్ఞ యాగాదులను చేయించవలసిన అవసరము ఏమొచ్చింది? ఈ విధానాలలో ఉన్న అజ్ఞానాన్ని తెలియడానికి త్రైత సిద్ధాంత దైవగ్రంథమైన **"ప్రతిమ విగ్రహ - దైవము దైయ్యము"** ను చదవండి. విమర్శించటం త్రైత సిద్ధాంత ఉద్దేశ్యము కాదు. విమర్శకు గురికాబడిన విషయాల హేతువును గుర్తించి తెలియజెప్పడమే త్రైత సిద్ధాంత లక్ష్యం. విమర్శించబడ్డ విషయంలో ఆవేశాన్ని సద్విమర్శగా స్వీకరించి సత్యాన్ని శాస్త్రబద్ధముగా తెలుసుకోవాలని జిజ్ఞాసులకు మనవి చేసుకొంటున్నాము.

ఒక విషయములో సంశయము ఏర్పడితే ఆ సంశయము నివృత్తి కోసము ఆ విషయం ఏ శాస్త్ర సంబంధమైనది అన్నతర్కం మనిషికి అవసరము. అప్పుడే ఆ విషయానికి శాస్త్రబద్దమైన పరిష్కారాన్ని పొందగలం. ఇక్కడ మనము ఆధ్యాత్మిక సంబంధ విషయాలను చెప్పుకొంటున్నాము. ముఖ్యంగా ఇందూ మత ప్రజలలో ఆధ్యాత్మిక వివాదాలు ఎక్కువ అని

చెప్పుకోవటంలో ఎటువంటి అతియోశక్తి లేదు. దీనికి ప్రధాన కారణం దైవ సంబంధ విషయాలు తెలిపే గ్రంథం నిర్థిష్టంగా ఇది అని తెలియక పోవటమే! ప్రధానంగా ఇందువులు పురాణాలు, వేదాలు, ఇతిహాసాలు ఈ మూడు మార్గాల ద్వారా ఆధ్యాత్మికమును అధ్యయనము చేస్తున్నారు. అయినప్పటికీ ఏ విషయం పురాణ సంబంధము, ఏ విషయం వేద సంబంధము, ఏ విషయం ఇతిహాస సంబంధము అనే వివరము చాలా మందికి తెలియదు. తెలిసినా అవి శాస్త్రబద్దత కలిగి యున్నాయా? లేదా? అన్న విచక్షణ లేదు. ఏ కొద్దిమందో కొంత విచక్షణ కలిగి భగవద్గీత ఆధ్యాత్మికతను తెలుపుటలో శాస్త్రబద్ధత కలిగి ఉంది అని భావించినప్పటికీ గీతను వాటిలో అంతర్భాగముగానే చూస్తున్నారు. ఒక ఆధ్యాత్మిక వివాదం తలెత్తితే దాని పరిష్కారానికి శాస్త్రాధారముగా ఏ పురాణ శ్లోకాన్నో చెపుతారు, ఏ వేదమంత్రాన్నో చదువుతారు, ఏ ఇతిహాస సంఘటననో ఉదహరిస్తారు. శాస్త్రబద్దముగా పరిష్కరించవలసిన విషయం అశాస్త్రీయ విధానముతో సరి చేస్తారు. దీనికంతటికీ మూల కారణము భగవద్గీత శాస్త్రబద్దముగా అర్థము కాకపోవటం. వేదాలు ప్రామాణికం అని చెప్పే సిద్ధాంతకర్తలకు కూడా భగవద్గీత వేద విషయాలను వ్యతిరేఖిస్తుంది అని తెలియదు. వేద వ్యతిరేఖ విషయాలు పరోక్షంగా భగవద్గీతలో అనేకచోట్ల ప్రస్తావించబడ్డాయి. పరోక్షముగానే కాకుండా ప్రత్యక్షంగా కూడా వ్యతిరేఖించిన కొన్ని సందర్భాలు ఉన్నాయి. ప్రత్యక్షంగా వ్యతిరేఖించిన సందర్భాలను ఇక్కడ గుర్తు చేసుకుందాము. సాంఖ్య యోగము 42వ శ్లోకములో **"వేదవాదరతాః పార్థ! నాన్యదస్తీతి వాదినః"** దీని భావము "లాభములు, సుఖములు కలుగు గుణ సంబంధ వేద విషయములను అజ్ఞానులైననూ, జ్ఞానులవలె బోధించు చుందురు". అదే సాంఖ్యయోగము 45వ శ్లోకములో **"త్రైగుణ్య విషయా**

**వేదా నిస్త్రై గుణ్యో భవార్జునా"** మూడు గుణముల విషయములే వేదములు. వేదభూయిష్టమైన ఆ మూడు గుణములను వదులుము అని భావము. పై రెండు ప్రస్తావనలు వేదాలను భగవద్గీత ఖండిస్తున్నట్లు ధృవీకరిస్తున్నాయి. అయినప్పటికీ మీరు వేదాలు ఆధ్యాత్మికానికి ప్రామాణికం అంటే మాకు ఎటువంటి అభ్యంతరము లేదు. మీ వేద బోధలను ఖండిస్తున్న భగవద్గీతను మీరు శాస్త్రీయంగా అధ్యయనం చేయండి. దేవుని కొరకు వేదాలను వదలి భగవద్గీతను సమర్థించండి.

ఒకే విషయాన్ని (దేవుని విషయం) రెండు వేరు వేరు గ్రంథాలు వేరువేరుగా చెప్పాయి అంటే అందులో ఒకటే సత్యమై తీరుతుంది. భగవద్గీతలో వేదాలు దేవుని విధానానికి ఆటంకము, అవరోధము వాటిని వదలండి అని చెప్పినట్లు ఆధారముంది. భగవద్గీత వెలువడక ముందే వేదాలు ఆవిర్భవించి ఉన్నాయి. వేదాలు సనాతనంగా ఆధ్యాత్మికానికి ప్రామాణికంగా చెప్పబడుతున్నాయి. మధ్యలో వెలువడిన భగవద్గీతను వేదాలలో సమర్థించలేదు, ఖండించంలేదు అని మీరు మమ్ములను ప్రశ్నించవచ్చు. దానికి మా సమాధానాన్ని కూడా దయచేసి తర్కబద్ధంగా స్వీకరించండి. సత్యాన్ని తెలియుటకు, శాస్త్రాన్ని నిరూపించుటకు గ్రంథములు వెలువడిన ముందు వెనుకల ప్రాధాన్యతను ఆపాదించడం సమర్థనీయం కాదు. డాల్టన్ పరమాణు సిద్ధాంతాన్ని కొన్నాళ్ళపాటు సమర్థించిన మనమే గెలీలియో పరిశోధనలు వెలువడ్డాక డాల్టన్ సిద్ధాంతాన్ని కొంత మేరకు ఖండించడం జరిగింది. ఒక విషయము సత్యమని నిర్ధారించుటకు అనుభవముతో కూడిన శాస్త్రీయత అవసరము కానీ అనుభవానికి రాని, నిరూపణకు నిలువని విషయాలను శాస్త్రము అంటే వినే రోజులు పోయాయి. దేవుని విషయాన్ని విచక్షణతో ఆలోచించే దానికి

అవకాశము ఇవ్వండి. దానివల్ల ప్రజలకు ఏది సత్యమో ఏది శాస్త్రబద్ధమో నిర్ధారించుటకు అవకాశము కల్పించినట్లవుతుంది. రెండిటినీ సమర్థించే రెండు నాల్కల ధోరణిని వదలండి. ఇటు కప్పను చావనివ్వక, అటు పాముని కరవనివ్వక ఉన్న కొందరి వైఖరి ఇప్పటికే కొంత బయటపడింది. ఇలాంటి వైఖరి వలన ప్రజలు శాస్త్రబద్దతను తెలుసుకోవటంలో నష్టపోవలసి వస్తుంది. త్రైత సిద్ధాంతము మిమ్ములను విమర్శిస్తోంది అని వాపోవటం కన్నా, త్రైత సిద్ధాంతములో ఏమైనా అశాస్త్రీయ విధానము ఉంటే దానిని వెలికి తీసి అడగండి. అంతేగానీ భగవంతుడు వేసిన భక్తిమార్గాన్ని మభ్యపెట్టి, అపమార్గములో భక్తులను నడిపిస్తామంటే త్రైత సిద్ధాంతము ఊరుకోదు. ప్రజలకు సత్యాన్ని సిద్ధాంతబద్ధముగా తెలియజేయుటయే త్రైత సిద్ధాంత లక్ష్యం. భక్తులు ఆధ్యాత్మికములో ఇంతవరకు నష్టపోయింది చాలు. ఇందూమత ప్రజలు భక్తిమార్గములో ఎంత నష్టపోయినది త్రైత సిద్ధాంతాన్ని తెలిస్తేగానీ తెలియలేరు. భక్తిమార్గములో ఇంకా నష్టపోతే త్రైత సిద్ధాంత ఆవిర్భావానికే అర్థము లేకుండా పోతుంది. వేదమంత్రములు, జపతపములు, యజ్ఞ యాగాదులను ప్రథమ దైవగ్రంథములోనే ఖండించారు. ద్వితీయ మరియు అంతిమ దైవగ్రంథాలలో వాటి ప్రస్తావనే లేదు. త్రైత సిద్ధాంత జ్ఞానము ద్వారా సత్యాన్ని తెలియండి. మూడు దైవ గ్రంథాలలో ఇమిడి ఉన్న యోగ మార్గాలను సిద్ధాంతవరంగా అర్థము చేసుకోండి.

యోగ ప్రక్రియ పూర్తిగా శాస్త్ర సంబంధమైనది. శాస్త్రబద్ధమైనది. యోగాన్ని పొందడానికి జప తపములుగానీ, వేదమంత్రోచ్ఛరణలు గానీ యజ్ఞ యాగాదుల విధానముగానీ, దానములుగానీ ఉపయోగపడవు. ఈ మూడు విధానములు యోగ ప్రక్రియకు సంబంధము లేనివి. ఈ ప్రక్రియలు మనిషి ప్రపంచములో మరింత మెరుగైన జీవితాన్ని అనుభవించడానికి

గుణ సంబంధముగా నిర్వహించబడుతున్న విధానాలు. గుణ రహితమైన, ప్రపంచేతరమైన ఆత్మ తత్త్వాన్ని పొందటానికీ గానీ, పరమాత్మ విధానాన్ని తెలియటానికి గానీ సహకరించవు. ఈ విషయాలు భగవద్గీతలో పలు చోట్ల ప్రస్తావించినప్పటికీ మనిషి గ్రహించలేకపోయాడు. దీనికంతటికీ మూలకారణము మనిషికి యోగ ప్రక్రియ విధానము శాస్త్రబద్ధముగా తెలియక పోవడము. తద్వారా యోగాన్ని పొందలేక పోవడము అని హేతుబద్ధముగా చెప్పవచ్చును. కొందరు జపతపములను యోగ ప్రక్రియగా, యజ్ఞ యాగాదులను యోగ విధానముగా చెప్పుకోవడము శాస్త్ర విరుద్ధమైన మాట అని తెలియలేకపోతున్నారు. ఈ విషయాన్ని తెలియుటకు భగవంతుడు ఆత్మసంయమ యోగము 46వ శ్లోకములో చెప్పిన సారాంశాన్ని గ్రహించండి. **"తపస్విభ్యోధికో యోగీ జ్ఞానిభ్యోపి మతోధికః"** తపస్వికుల కంటే యోగి ఉత్తముడు. ఈ వివరము ద్వారా **యోగము వేరు, తపస్సు వేరు** అని చెప్పడానికి శాస్త్రాధారము దొరికినట్లు అయింది.

ఒక విషయాన్ని వేరొక విషయముతో బేరీజు వేసినప్పుడు అందులో ఉన్న రెండు విషయాల పట్ల అవగాహన ఉన్నప్పుడే బేరీజు వేసిన విషయాలలోని అంతరాన్ని తెలియగలము. తపస్సు, యజ్ఞయాగముల విషయము పురాణములు, వేదముల ద్వారా అర్థము చేసుకున్న మనిషి యోగ ప్రక్రియను భగవద్గీత ద్వారా అర్థము చేసుకోలేకపోయాడు. ఎప్పుడైతే వాటి వ్యత్యాసాన్ని తెలియలేకపోయాడో, అప్పుడు తపస్సుకంటే యోగము ఎట్లు గొప్పది అయిందో, ఎందుకు గొప్పది అయిందో కూడా తెలియలేదు. యజ్ఞములు, తపస్సులు గుణబద్ధముగా కర్మేంద్రియ, జ్ఞానేంద్రియముల సహకారంతో జరిగితే యోగము గుణరహితముగా అంతరేంద్రియ వ్యవస్థ ఆధారముతో జరుగుతుంది. కొన్ని పదాలు సారూప్య భావము కలిగి

యున్నప్పుడు వాటిని శాస్త్రబద్దముగా నిర్వచించాలంటే వాటి విధానాన్ని శాస్త్రాధారముతో తెలియాలి. అప్పుడే వాటి అంతరాన్ని, భేదాన్ని శాస్త్రబద్ధంగా తెలిసినట్లు అవుతుంది. యోగము, తపము, యోగి, తపస్వి వీటి అర్థము, భావము శాస్త్రబద్ధముగా తెలియకపోవటం మూలానే ఏది ప్రకృతి? ఏది పరమాత్మ? అన్న వ్యత్యాసం తెలియకుండా పోయింది. ఏది మాయ? ఎవరు ఈశ్వరుడు? అన్న విచక్షణను కోల్పోయాము. ధర్మారాధనలుగా ఉన్న మూడు యోగ మార్గాల ద్వారా తెలియవలసిన ఈశ్వరుడిని (ఆత్మశక్తి) తెలియక అధర్మారాధనలుగా ఉన్న వేదమంత్రములు, యజ్ఞయాగాదులు, దానములు, జపతపములాచరణతో మాయలోనే మనిషి మగ్గిపోతున్నాడు. యోగమార్గము ద్వారా పొందవలసిన ఈశ్వర శక్తిని పొందలేక, మాయ మార్గము ద్వారా మరింత కర్మను మూటగట్టు కొంటున్నాడు. జన్మ పరంపరలకు కర్మ నిర్మూలనా మార్గాలు తెలియక పోవడమే ప్రధాన కారణము. కర్మ నిర్మూలన సూత్రాలను సిద్ధాంతబద్దము చేసింది త్రైత సిద్ధాంతము.

కర్మమూలాన ఎన్నో జన్మలనుండి అభాగ్యులుగా ఉన్న మమ్ములను నిజమైన భాగ్యవంతులుగా చేయటానికి వచ్చిన **ఓ ఆచార్యా!** మీరు ఆచార్యులు మాత్రమే కారు అని మేము ఎరుగుదుము. నిరాశ్రయులమై, నిరుపేదలమై, గాలికి తిరుగుతున్న మమ్ములను ఒక గూటికి చేర్చి త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక పట్టాను అందించిన **ఓ సిద్ధాంతకర్తా!** మీరు సిద్ధాంత కర్త మాత్రమే కారు అని మేమెరుగుదుము. మూలన పడి ఉన్న మూడు దైవగ్రంథాలు బ్రహ్మ విద్యా శాస్త్రానికే మూలము అని శాస్త్రబద్ధతను కల్పించిన **ఓ శాస్త్రవేత్తా!** మీరు కేవలం శాస్త్రవేత్త కాదని మేము ఎరుగుదుము. ఒకే మందగా ఉండవలసిన గొర్రెలను మంద చెదరి, బెదరి దారి తెలియక

తిరుగుతున్న మమ్ములను మందలోకి మళ్ళించటానికి వచ్చిన **ఓ కాపరీ!** నీవు కేవలము కాపరివి కాదని మేము ఎరుగుదుము. దూతగా వచ్చి దాతవు అయినా దూతవు మాత్రమే కావు, అవధూతవు అని మేము ఎరుగుదుము. మనుషుల మధ్యకు ప్రతినిధిగా రావు అని ప్రచారము చేస్తున్న సైతానుల ప్రచారాన్ని ఖండిస్తూ ప్రతినిధిగా వచ్చిన **ఓ ప్రతినిధీ!** నీవు ప్రతినిధివి మాత్రమే కావు, అధిపతివి అని మేము ఎరుగుదుము. ఖగోళాన్ని శోధించి, పరిశోధించిన మేము సూర్యునికి ఉన్నది గురుత్వాకర్షణ శక్తి కాదు, అది గురుశక్తి అని మేము ఎరుగుదుము. సర్వ జగతిని కర్మ ప్రకారముగా చరింపజేస్తున్న గ్రహాలకున్నది గ్రాహితశక్తి కాదు, అది గురుశక్తి అని మేము ఎరుగుదుము. భూమికి ఉన్న భూమ్యాకర్షణ శక్తే గురుశక్తి అని మేము ఎరుగుదుము. ఆకాశములో ఉన్న నక్షత్రాల స్వయం ప్రకాశము నక్షత్రానిది కాదు, అది గురు ప్రకాశము అని మేము ఎరుగుదుము. సకల జగతిని చరింపజేస్తున్న ఆత్మశక్తికి పర్యాయ పదమే గురుశక్తి అని మేము ఎరుగుదుము. ఇంత ఎరిగిన మేము ఆ శక్తే రూపమై ప్రత్యక్షమైతే ఏమీ చేయలేని నిస్సహాయులము అని మేము ఎరుగుదుము. ఈ జన్మకు ఈ ఆనందానుభూతితో పెల్లుబుకు తున్న మా కన్నీటిని అదుపు చేయాటానికే మాకు సమయం చాలటం లేదు స్వామీ! ఇలాంటి పరిస్థితి జగతిలో ఉన్న ప్రతి జీవునికి ఒక్కసారి అయినా అనుభవించటానికి అవకాశము కల్పించండి అని యోగీశ్వరుల వారిని వేడుకుంటూ... సెలవు.

**ఒక జీవుడు, నారాయణ రావు**



# నాది లోచన-నీది ఆలోచన

## యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక రచనలు

